## రుదాలీ

అవధుల్లేని విషాదం / నల్లని మేసు వస్త్రమై
ముఖాన్ని కప్పేసినపుడు/ఎడారుల్లాంటి కళ్ళ యిసుకలో
ఒక నీటి చుక్కైనా మొలవలేదు/అలుపెరుగని బాధ
శరీరాన్ని కంటక పరిష్వంగంలో గాయపర్చినా
కంఠనాళంతో ఎగసిన ఆర్తనాదం/కన్నీరై తన్నుకు రాలేదు
జైసాల్మేర్ ఎడారుల సాక్షిగా
ఎడారి ఒడ్డున పుట్టి గుడిసెల సాక్షిగా
ఆమె ఎన్నడూ కళ్ళని చిదుముకుని
ఎండిన చెంపల మీద వరదలు పారించలేదు / కాలమా
పరిగెత్తడం మానేయ్....
విషాన్ని ఊపిరిగా తాగుతున్న అల్పాయుష్కులు
నీతో పోటీ పడలేరు....
ఒక్క వర్షపు నీటి చుక్క కోసం
తపించి కొట్టు మిట్టాడిన ముసలి ప్రాణం
సుడులుగా రేగే ఇసుకలో కలిసి పోయింది
కన్రెప్పల కింద స్వర్గ ఛాయల్ని
నోట దొక్కైనల నిండా జీవిత కాలపు నీటిని చూపిన
మద మెక్కిన గండు తుమ్మెద
కలల నీడై కోట బురుజు గోడల్లో కరిగి పోయింది-
చేతుల్నిండా ప్రేమగా తొడిగిన గాజులు
గల గల్లాడక ముందే
దైవమహిమ విష ప్రసాదమై విరుచుకు పడి
వున్న వొక్క మగ తోడూ పుటుక్కున విరిగిపోయింది
కాలమా/వీచడం మానేయి
గాలిలో ఎగిరిపోయిన జీవితాలు ఎక్కడ కలుస్తాయో....
రాళ్ళని బద్దలు కొడుతున్న వెట్టి చాకిరీ చేతుల గాయాల్లో
జీవితం చిట్లిపోతోంది
సన్నిచరికి ఎన్నడూ కన్నీరు రాలేదు
పది హేనేళ్ళ యిసుకలా జారిపోయాక
బాల్య స్మృతుల్లో మిగిలిన కొడుకు
బంధ విముక్తుడై కట్టెదుట నిల్చినపుడు పొంగిన ఆనందాతిరేకం
చెక్కు చెదరని ఎడారి ముడుతల్లో సమాధై పోయింది
భవిష్యత్తు గర్భంలోని తొలి బీజాన్ని

# ఈ సంచికలో.....

# సంపాదకీయం

## కాశ్మీరీయుల పోరాటం ప్రజాస్వామికం
## అణచివేత పచ్చినిరంకుశం

హజరత్‌బాల్ దర్గా సంఘటన ద్వారా కాశ్మీర్ సమస్య మరొకసారి పత్రికా శీర్షికల్లో కెక్కింది. దర్గాలోని భక్తులను, "మిలిటెంట్లను" పూర్తిగా చుట్టు ముట్టిన భారత సైన్యం ఇన్ని రోజులు ఓర్పు వహించిందంటే ప్రభుత్వ చేతకాని తనంగా కొందరు అడిపోసుకుంటుంటే భారత పాలకుల "శాంతి" తత్వానికి నిదర్శనంగా మరికొందరు ప్రచారం చేస్తున్నారు. నిజానికి గత 46 సం॥లుగా ఢిల్లీ ప్రభువులు అనుసరిస్తున్న మోసపూరిత, అణచివేత విధానాలు- ముఖ్యంగా కాశ్మీర్‌లో మానవ హక్కుల ఉల్లంఘన పట్ల అంతర్జాతీయ స్థాయిలో తలదించుకునే విధంగా బహిర్గతం కావటంతో, దూకుడుగా సాగటానికి తటపటాయిస్తున్నారే తప్ప మరొకటి కాదు. జరుగనున్న మినీ ఎన్నికలు, అమెరికన్ సామ్రాజ్య వాదపు వైఖరి కూడా మరి కొంత కారణం కావచ్చు.

కాశ్మిర్‌లో కర్ఫ్యూ అమలులో ఉండగానే వేలాది మంది ప్రజానీకం భారత మిలటరీ జోక్యానికి వ్యతిరేకంగా బజారుల్లో కొచ్చి చావుకి కూడా తెగించి పోరాడు తున్నారంటే అది వారి స్వాతంత్ర కాంక్షనే తెలియపరుస్తుంది. ఓటమికి గురయ్యా మనే అపకీర్తి కన్నా "గాలికి పోయే పేలపిండి రామార్పణం" అన్నట్టు కాశ్మీరు నుండి భారత మిలటరీని ఉపసంహరించుకుని, ఇప్పటికైనా ప్రజాభిప్రాయానికి అను గుణంగా నిర్ణయం తీసుకోవటం గౌరవ ప్రదంగా వుంటుంది.

కాశ్మీరు మాజీ మహారాజు కొడుకు డా॥ కరణ్‌సింగ్, హజరత్‌బాల్ దర్గా దర్శనానికి విచ్చేసి ప్రకటించిన అభిప్రాయాలు, ఆయన లోపల ఉద్దేశం ఏదైనా, గమనించదగినవిగా ఉన్నాయి. భారత- పాకిస్తాన్‌లుగా దేశం విభజించబడిన తర్వాత కాశ్మీరు అందులో గానీ, ఇందులో గానీ చేరదలుచకోలేదనీ, పాకిస్తాన్ సైనిక ఆక్రమణను తట్టుకోలేకనే భారత దేశంతో కలపటానికి తన తండ్రి సంతకం పెట్టా డనీ ఆయన ప్రకటించాడు. కాశ్మీరు వివాదాన్ని పరిష్కరించుకోడానికి పాకిస్తాన్‌తో చర్చలకు సిద్ధపడే భారత పాలకులు కాశ్మీరు మిలిటెంట్లతోనూ, కాశ్మీరు ప్రజలతో కూడా చర్చలు జరపాలని ఆయన కోరాడు. ఇప్పటి దాకా దుష్ప్రచారాలతో నిండి పోయిన పత్రికలకు, దురహంకారులకు ఇది మింగుడుపడని అంశంగా తయార యింది.

కాశ్మీరు సమస్యను, పాకిస్తాన్‌తో సమస్యగానూ, హిందూ- ముస్లిం సమస్యగానూ భారత పాలకులూ, వారి వందిమాగధులూ దుష్ప్రచారం గావించారు. కాశ్మీరు విలీనం కాలం నాటి ఒప్పందాలను, పాకిస్తాన్, ఇండియా ఉల్లంఘించి అంతర్జాతీయ స్థాయిలో అపహాస్యం పాలయ్యారు.

బ్రిటీషు సామ్రాజ్యవాదులు భారత ఉపఖండం నుండి తెర వెనక్కి తప్పుకునేటప్పుడు- కాశ్మీరు, నైజాం తదితర అనేక సంస్థానాలకి 'స్వతంత్రం' ఇచ్చి వెళ్ళాడు. నిజాం రాష్ట్రంలో హిందువులు మెజారిటీ- రాజు ముస్లింలాగే, కాశ్మీరులో ముస్లిములు మెజారిటీ- రాజు హిందువు. ఇక్కడ పరిపాలకుడు ముస్లిమే అయినా పాలక వర్గంలో హిందూ భూస్వామ్య వర్గం బలంగా ఉండేది. అక్కడి పరిపాలకుడు పాలక వర్గమంతా హిందువులే. ఇక్కడ ఉర్దూ అధికార భాషయితే అక్కడ సంస్కృతం వుండేది. ఇక్కడ ప్రజలు తెలుగు, ఉర్దూ, మరాఠీ, కన్నడం మాట్లాడితే అక్కడ కాశ్మీరీ డోగ్రీ తదితర స్థానిక భాషలు మాట్లాడతారు. సంస్కృతం ఎవరి మాతృభాషా కాదు. తెలంగాణా రైతాంగం, నిజాము నవాబుకీ ఆయన తొత్తులూ ప్రజా పీడకలు అయిన హిందూ దేశముఖులకీ వ్యతిరేకంగా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన పెద్ద పోరాటం చేసినట్టే, కాశ్మీరులో షేక్ అబ్దుల్లా నాయకత్వాన గల నేషనల్ కాన్ఫరెన్స్ అధ్వర్యంలో ఫ్యూడల్ ప్రభువులకూ, బ్రిటీషు సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పెద్ద ప్రజాపోరాటం జరిగింది. కాశ్మీర్ ముస్లిములలో అత్యధికులు పేదవారయి వుండటం దోపిడీ పాలక వర్గం ప్రధానంగా (బ్రాహ్మణ) హిందువులై వుండటంతో దాన్ని హిందువులకి వ్యతిరేకంగా ముస్లిములు సాగించిన పోరాటంగా పెత్తందారీ వర్గం ప్రచారం గావించింది.

1944లో 'అఖిల జమ్ము కాశ్మీర్ జాతీయ మహాసభ' విడుదల చేసిన ప్రణాళికలో-

— పౌరులందరికీ సమాన హక్కులు; పనిచేసే హక్కు; కాశ్మీర్ మహిళలకు సమాన హక్కులు; కాశ్మీర్ ప్రజలచేత ఎన్నికైన రాజ్యాంగ నిర్ణాయక సభచే ప్రభుత్వం ఏర్పాటు; కీలక పరిశ్రమలను జాతీయం చేయటం; ప్రైవేట్ వ్యక్తిగత గుత్త సంస్థల ఆస్తులను రద్దు, స్వాధీనం; జమిందారీ వ్యవస్థ రద్దు- దున్నేవానికే భూమి పంపిణీ; బ్రిటీషు వారు రుద్దిన అమృతసర్ సంధి రద్దు- ఇలాంటి ప్రజాస్వామిక లక్ష్యాల కోసం ఉద్యమాన్ని నడిపిన షేక్ అబ్దుల్లాను RSS లాంటి హిందూ మతోన్మాద సంస్థలు ముస్లిం దురహంకారిగా భారతదేశంలో ప్రచారం గావించాయి. కానీ 1944 లోనే మహమ్మదాలీ జిన్నా కాశ్మీర్ ముస్లిములను మత ప్రాతిపదికపై పాకిస్తాన్‌లో చేరిపొమ్మని కోరినా, షేక్ అబ్దుల్లా- నేషనల్ కాన్ఫరెన్స్ తిరస్కరించాయి. అందుకు ఆగ్రహించిన జిన్నా, వారిని గూండా గిరీగా తిట్టిపోసి కాశ్మీరు హిందూ రాజుకి ఇలా విజ్ఞప్తి చేశాడు.

"నేను కాశ్మీరు ప్రభుత్వానికి విన్నవించుకునేదొకటే. ఎలాంటి మార్గమైనా సరే అనుసరించి గుండాగిరిని అణచివేయాల్సిందే" భూస్వామ్య- దళారీ వర్గాల ప్రతినిధులకి ప్రజాస్వామిక వాదులది 'గుండాగిరీ' గానే కనిపించటంలో ఆశ్చర్యం ఏముంది?

మత ప్రాతిపదికపై దేశ విభజన జరిగినా మెజారిటీ ముస్లిములున్న కాశ్మీర్- పాకిస్తాన్‌లో కలవలేదు. కాశ్మీరు సరిహద్దు ప్రాంతాలైన పంజాబు, వాయువ్య సరిహద్దులలో మత కలహాలు పెద్ద ఎత్తున జరిగి మారణకాండ సాగుతున్న కాశ్మీర్‌లో ఒక్క మత ఘర్షణ కూడా రేగలేదు. ఇది కాశ్మీరీల లౌకిక తత్వానికి, స్వాతంత్ర్య కాంక్షకూ నిదర్శనం.

అధికార మార్పిడి నాడు సంస్థానాధీశులకి బ్రిటీషువాడిచ్చిన "స్వాతంత్ర్యం" భారత, పాకిస్తాన్‌లలో ఏదో ఒక దానిని ఎంచుకోవటం వరకే గాని వాటి నుండి వేరుగా ఉండే హక్కు గల స్వాతంత్ర్యం కాదని ఒక వాదన వుంది. ఇది స్వాతంత్ర్యాన్ని హక్కుగా కాక భిక్షగా పొంది, ప్రజల హక్కులనూ, అధికారాన్నీ నిర్లక్ష్యం చేసే పెత్తందారీ ధోరణి. అందుకే 1947 నవంబరులో మౌంట్ బాటన్ నివాసంలో భారత ప్రధాని నెహ్రూ, పాకిస్తాన్ ప్రధాని లియాఖత్ అలీఖాన్‌ల మధ్య కుదిరిన ఒప్పందం గానీ, ఇప్పుడు అదే పనిగా వల్లిస్తున్న సిమ్లా ఒప్పందం గానీ- కాశ్మీర్ ప్రజలను విస్మరించి వారి గురించిన తీర్పు భారత్-పాక్ ప్రభుత్వాలు పుచ్చుకుంటున్నాయి. వీరుభయులకీ కాశ్మీరంటే పంచుకుతినే రొట్టెముక్క గానీ, సజీవ సంస్కృతిగల జాతి జనులుగా గోచరించటం లేదు. ఈ తత్వంతోనే పాకిస్తాన్ పాలకులు 1947 అక్టోబరులో దౌర్జన్యంగా కాశ్మీర్‌లోకి సైన్యాన్నీ, కొండజాతి సాయుధ మూకల్నీ పంపి 'ఆజాద్ కాశ్మీర్'ని ఆక్రమించుకున్నారు. వారి పెద్దన్నలైన భారత పాలకులు దాన్ని సాకుగా తీసుకుని మెల్ల మెల్లగా సహాయం పేరిట ప్రవేశించి 'జమ్ము కాశ్మీర్'ని తమ అధీనంలోకి తెచ్చుకున్నారు.

భారతపాలకుల మోసపూరిత చర్యలను అర్థం చేసుకోవడానికి ఈ క్రింది ఉదాహరణలు చాలు.

పాకిస్తాన్ సైనిక జోక్యంతో బెంబేలెత్తిన మహారాజు హరిసింగ్ 26-10-1947న కాశ్మీర్‌ని భారత్‌లో విలీనం చేస్తాననీ, సైనిక సహాయం చేయమనీ అర్థించాడు. దానికి నాటి గవర్నర్ జనరల్ మౌంట్ బాటన్ "కాశ్మీరు భూభాగం నుండి దురాక్రమణ దారుడు సంపూర్ణంగా తరిమివేయబడిన తర్వాత ప్రజాభిప్రాయం సేకరించవలసి యున్నదని నా ప్రభుత్వం యొక్క అభిమతం" అని మరునాటి రోజే జవాబిచ్చాడు.

భారత ప్రధాని నెహ్రూ 2-11-1947న కాశ్మీరు గురించి రేడియో ప్రసంగం చేశాడు.

"ముస్లిం, హిందూ, శిక్కు నిరాయుధ వాలంటీర్లు అద్భుత ప్రతిభాశాలుడైన షేక్ అబ్దుల్లా మరియు ఆయన పార్టీ సహచరులు వీధుల్లోకి వచ్చి పరిస్థితులను అదుపులోకి తెచ్చి భయాన్ని పాల ద్రోలారు" "తమ 'దేశాన్ని' నాశనం చేస్తూ, భయోత్పాతంతో పాకిస్తాన్‌కు అప్పగించేందుకు క్రూరమైన దాడులు చేస్తున్న దుష్టుల నుంచి, తమ దేశాన్ని రక్షించుకోవాలని దృఢ నిశ్చయంతో ఉన్నారు—" మత కల్లోలాలతో విషపూరితంగా మారిన భారతదేశ ప్రజానీకానికి ఈ అనుభవాలను తెలియజేయగలిగితే మంచి ఫలితాలు వస్తాయి. చొరబాటు దార్లకు వ్యతిరేకంగా గొప్ప నాయకుడైన షేక్ అబ్దుల్లా ప్రేరణతో కాశ్మీరు లోయలోని ముస్లిములు, హిందువులు, శిక్కులు తమ మాతృదేశ రక్షణ కోసం భుజం భుజం కలిపారు."

**"మన సేనలు వారికి సహకరించుటకోసమే కాశ్మీరు వెళ్ళాయి. చొరబాటు దారుల నుండి స్వేచ్ఛలభించిన తర్వాత అక్కడ వుండాల్సిన అవసరం మనకు లేదు. వారి భవిష్యత్తును వారికే అప్పగించి మన సేనలు వస్తాయి..."**

"యుద్ధవాతావరణం సద్దు మణిగిన తర్వాత **1951**లో, ఎన్నికలు (ఇప్పటికవే స్వేచ్ఛగా జరిగిన మొదటి, చివరి ఎన్నికలు) జరిగి రాజ్యాంగ నిర్ణాయక సభ ఏర్పడింది. జమ్ము అండ్ కాశ్మీరు నూతన రాజ్యాంగ చట్టం అమలులోకి వచ్చింది. కాశ్మీరుకి ప్రత్యేక జాతీయ పతాకం-జాతీయ చిహ్నం ఏర్పడ్డాయి. ఢిల్లీ అనుకూలురైన డోగ్ర ప్రతినిధులకు జవాబుగా భారత్— పాకిస్తానులకు హెచ్చరికగా షేక్ అబ్దుల్లా ఆ రోజు ఇలా ప్రకటించాడు "కాశ్మీరు రాజ్యాంగసభ నూటికి నూరుపాళ్ళు సార్వభౌమాధికార సంస్థ. దీనికంటె ఉన్నతాధికారులుగల సంస్థ మరొకటి లేదు. భారత పార్లమెంటుకుగానీ, కాశ్మీరు బయటగల ఇంకే ఒక్క పార్లమెంటుకిగానీ మనపై ఎట్టి అధికారం లేదు"

1952లో భారత ప్రభుత్వంతో కాశ్మీర్ ప్రధాని షేక్ అబ్దుల్లా ఒప్పందం కుదుర్చుకున్నాడు. భారతదేశంలోలాగా కాక, నష్ట పరిహారం చెల్లించకుండానే ఫ్యూడల్ దొరల భూమిని స్వాధీన పరుచుకుని పేదప్రజలకు పంచారు. రాజభరణాలు రద్దు చేశారు. సంస్కృతానికి బదులు కాశ్మీరీని అధికార భాషగా ప్రకటించారు. దానితో భారతదేశంలోని ఫ్యూడల్ వర్గాలు హిందూ మతోన్మాద శక్తులు గగ్గోలు పెట్టాయి. మహారాజ హరిసింగ్ ఫ్యూడల్ నిరంకుశత్వాన్ని ఏనాడూ వీరు ప్రశ్నించలేదు. రాజా హరిసింగు మొదట పాకిస్తాన్ ప్రభుత్వంతో యథాతథ ఒడంబడిక చేసుకున్నప్పుడు వీరు నోరెత్తలేదు. కాశ్మీరు స్వతంత్ర రాజ్యంగా వుండాలన్న మహారాజా కోర్కెను RSS బలపరచడమే కాక పండిత ప్రేమనాథ్ డోగ్రా (జనసంఘ్ అధ్యక్షుడు) దానికి నాయకత్వంకూడా వహించి నడిపాడు. కానీ షేక్

అబ్దుల్లా నాయకత్వాన నేషనల్ కాన్ఫరెన్స్ ప్రభుత్వం రాచరిక వ్యవస్థను రద్దు చేయటమే తడవుగా దాన్ని మత సమస్యగా చిత్రించి, కాశ్మీరు స్వతంత్రం అన్యాయ మంటూ ఆ నాటికీ, ఈ నాటికీ గగ్గోలు పెడుతున్నారు.

కాంగ్రెసు పాలకులకు, హిందూ మతోన్మాద జాతీయ దురహంకారులకు తేడా ఒకటి. ఒకరు వ్యవహారాన్ని సున్నితంగా నడిపి చాపకింద నీరులా చేరి, తడిగుడ్డతో గొంతుకోసే పద్ధతిని- రెండవ వారు దౌర్జన్యంగా దురాక్రమణ తత్వంతో నెగ్గాలనే దాన్ని ఎంచుకున్నారు. ఆజాద్ కాశ్మీరుని కూడా కలుపుకోడానికి, సమైక్య విశాల కాశ్మీర్ రాజ్యం ఏర్పాటుకి అబ్దుల్లా స్వతంత్రంగా ప్రయత్నిస్తున్నాడు. దాన్ని సహించలేని భారత పాలకులు 1953లో అబ్దుల్లాని అరెస్టు చేసి, ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేశారు. మొత్తం కాశ్మీరుని భారత మిలటరీ ఆధిపత్యం కిందకి తెచ్చుకున్నారు.

ఆ నాటినుండి ఈ నాటి దాకా- 40సం॥ల పాటు....క్రూర హింసా కాండను కాశ్మీరులో అమలుచేస్తూ వస్తున్నారు. తమ తొత్తులను అధికారంలో నిలపటం లొంగకపోతే ప్రభుత్వాల్ని రద్దు చెయ్యటం సాగిస్తున్నారు. బూటకపు ఎన్నికలను నిర్వహిస్తున్నారు. ప్రజలు స్వచ్ఛందంగా ఎన్నికలను బహిష్కరిస్తున్నారు. రిగ్గింగు చేసుకున్నా 5 శాతం కంటె ఎక్కువ ఓట్లు పోల్ కావటంలేదు. భారత రాజ్యం యొక్క నిజమైన స్వభావం, రాజకీయ పక్షాల యొక్క ప్రజాస్వామికతకు కాశ్మీరు పట్ల అవి వ్యవహరిస్తున్న, ప్రకటిస్తున్న వైఖరులే ఒక నిదర్శనంగా చూపవచ్చు. భారత సాయుధ దళాలు కాశ్మీర్ ఉద్యమాన్ని అణచటానికి గ్రామాలకు గ్రామాలను తగులబెట్టటం, విధ్వంసకాండ సాగించటం, విచక్షణా రహితంగా కొట్టి కాల్చి చంపటం, మహిళలపై సామూహిక అత్యాచారాలు జరపటం, పౌర జీవనాన్ని ఛిద్రం చేయటం, ఆదాయ వనరుల్ని ఘోరంగా నష్ట పర్చటం లాంటి చర్యలు చేపట్టారు. షేక్ అబ్దుల్లా, నేషనల్ కాన్ఫరెన్స్‌లు భారత పాలకులకి కాలక్రమంలో లొంగిపోయాయి. అయినా కాశ్మీరుల స్వతంత్ర కాంక్ష చల్లారలేదు. జమ్మూ-కాశ్మీర్ లిబరేషన్ ఫ్రంట్‌ను ఏర్పాటు చేసుకుని రెండు కాశ్మీర్‌లను కలిపి స్వయం నిర్ణయాధికార హక్కుని పొందాలని పోరాడుతున్నారు.

వారి పోరాటమంతా హిందువులకు వ్యతిరేకమైనదిగా చిత్రించటానికి కాశ్మీరు లోయలో ఉండే హిందువులను జమ్ముకి ప్రలోభ పెట్టి, దౌర్జన్యంగా తరలించారు. గవర్నర్ జగ్‌మోహన్ హయాంలో ఇలా పథకం ప్రకారం తరలింపులు జరిగాయని కులదీప్ నయ్యర్ రాశాడు.

(తరువాయి 61 వ పేజీలో)

# సాహిత్య పరిశోధకుడు - బంగోరె

బండి గోపాలరెడ్డి (బంగోరె) ఒక విశిష్ట వ్యక్తిత్వంగల చారిత్రక పరిశోధకుడు. ఒక చిన్న ఆధారం దొరికితే చాలు, దాన్ని పట్టుకొని, ఆ చారిత్రకాంశం యొక్క లోతుపాతులు చూడనిదే నిద్రపోయేవాడు కాదు. చరిత్ర పట్ల, చారిత్రక పత్రాల పట్ల, చారిత్రకాంశాల పట్ల, వాటిని కాపాడటం పట్ల మనకున్న నిర్లక్ష్యమే బంగోరె విశేష శ్రమ చేయాల్సిన అవసరాన్ని తెచ్చిపెట్టింది. బంగోరె లాంటి చరిత్ర పరిశోధకులు మనకు విరివిగా లేరు గనుకనే కొన్ని కొన్ని విషయాలలో - సెకండరీ ఆధారాలతో, తాము మూలాధారాలను పరిశీలించినట్లు ఫోజుగొట్టే చరిత్రకారులు కనబడుతున్నారు. మరికొందరు ఆయా రంగాలకు ఆద్యులం తామేనని, చరిత్ర తమతోనే ప్రారంభమైందనీ జబ్బలు చరుచుకుంటారు. వీరందరి ధోరణులపై చావుదెబ్బ కొట్టాడు బంగోరె. చారిత్రకాంశాల పరిశోధన ఎంత ఆమూలాగ్రంగా, ఎంత అంకిత భావంతో, ఎంత త్యాగ బుద్ధితో, కేంద్రీకరించి చేయాలో మనకు నేర్పాడు బంగోరె.

'కడప ఊళ్ళ సంకలనం'కు ముందు మాటలు రాస్తూ బంగోరె తన ఆవేదనను ఇలా వెలిబుచ్చారు. "తెలుగు వాళ్ళు హీన చరిత్రులు కాదుగానీ, చరిత్ర హీనులుగా మాత్రం వుండి పోతున్నారు. పూర్వం సంగతేమోగాని, యిప్పుడు మాత్రం చెప్పుకోదగిన ఆంధ్ర చరిత్రకారులు చెప్పుకో తగినంతమంది లేని కొరత కొట్టవచ్చినట్లు కనపడుతున్నది....తెలుగు చరిత్రకారులుగా చలామణిలో వున్న కొద్దిమంది సైతం ఒకరిద్దర్ని మినహాయిస్తే, లోతుకు దిగి మూలాధారాలను (Original Sources) పరిశీలించకుండానే చిలక పలుకులు పలుకుతూ పై పై వ్రాతలు వ్రాసేస్తున్నారు....చిలక పలుకులు తత్వం, ఎంగిలి మెతుకుల బ్రతుకు మనలో పోవడం లేదు."

మల్లంపల్లి, నేలటూరు, కొమర్రాజు, భావరాజు, చిలుకూరు లాంటి సంప్రదాయ 'విశుద్ధ' చరిత్రకారుల గురించి చెప్తూ, 'చరిత్ర అంటే యేవో గతకాలపు సంగతులను శ్రమించి, పోగుచేసి ఉల్లేఖించే జిగిబిగిని చూపే తత్వం మినహా మరో సామాజిక తత్వాన్ని వీరు సాధించలేకపోయారు.... గతించిన ఆ రాజవంశాల చరిత్రను గడుస్తున్న సమాజ చరిత్రతో ఎట్లా అనుమేళన చేసుకోవాలో చూపకుండానే— అట్లా అనుసంధింపచేసే సామాజికశాస్త్ర సరళిలో వాత ప్రాణవంతమైన చరిత్ర తత్వాన్ని అందివ్వకుండానే వారి చరిత్ర రచనా పవిత్ర యజ్ఞం

(తరువాయి 57వ పేజీలో)



# ఓసు

— మిత్ర

"ఇయ్యాల సాలా అన్ని ఇసయమున్నట్లు లేవు. [1]యీ పొద్దుసుంచి ఓసేనాయె. సికారికేయ పస్తున్నేసు. ఇయ్యాల్ల పస్తు పోనిత్తనోలేనో." అంటూ ఒకవైపు మాంకోలగట్టె[2] గట్టాపై కిందికి, మీదికి జూత్తా మనసులోనే గుసగుస పెట్టినట్లు అనుకుంటుంది అప్పాయమ్మ.

"ఏం బ్రో మనసులోనే గొణుక్కుంట[3] కిందికి మీదికి జూత్తున్నవు. దయ్యం గిట్ల పట్టిందిరా" వల పెడ్తున్న మనిషి అప్పయ్యను ఎత్తి పొడ్చింది.

"ఏ ... (అంటూ తల పైకెత్తి) ఎండ పొడుపు వత్తదేమోనని జూత్తున్ననే. పొద్దువొత్తె గీ వనన్నిట్టుమని" మాట ముగించి తన పనిలో నిమగ్నమయ్యిండు అప్పయ్య.

"ఆ ... (అంటూ రాగం తీసి) అండ్ల వొర్కుతున్నాయి బుట్లకు బుట్లని వలికి బయపడి ఓసిడ్వక కూసున్నమా!?"అక్కడ కూర్చున్న పదిమందిలో ఎవరిదో ఎత్తిపొడుపు మాట.

"ఓ దిక్కు బెర్రపొద్దుత్తున్నట్లె అత్తుంది. మల్ల మొగులు కమ్ము కత్తున్నట్లె ఉంది. మూను ముక్కల[4] సికారిచేసి ఇగం[5]బట్టి సావాలెరా." బాలయ్య ఆశ, నిరాశల మధ్య కొట్టుమిట్టాడుతున్నాడు.

అది గంగపుత్ర సంఘపుత్ర సంఘం ఆఫీసు కాదుగానీ,రోజూవృత్తి పనిచేసుకుంటూ కులమోల్లంతా కూడే వాకిలి అది. పొద్దుగాల్లెవ్వంగనే నోట్లో వేపపుల్లేసు

1. "యీ పొద్దుల సుంచి" — సూర్యోదయాల నుండి
2. "మాంకోలగట్టె" — గజం పొడవుండె కంకగట్టె. దీనిపైనే వలతో పిల్ల రొయ్యలను పట్టి అమ్ముకారు.
3. "గొణుక్కుంట" - లోలోపల మాట్లాడుకుంట
4. "మూను ముక్కలు" — అతి కొద్ది అనే పరిహాసానికి చిహ్నం.
5. 'ఇగం' — చలి

కుని సకులం మొకులం[6] పెట్టుకుని కూర్చుని కాళ్ళ సందుల మాంకోల కట్టె పెట్టుకుని చాలామంది వల, తోపెల్లకవసరమైన మాల్లా నరుక్కులు[7] గడ్తుంటారు. మరికొందరేమో పద్మశాలి లచ్చినర్సయ్య దగ్గర సుట్టిచ్చిన నూలుదారం కండెలు దెచ్చి మూడు నాలుగు పోగులను కలిపి అరచేయికి సుట్టుకుంటూ రెండు కాళ్ళమీద కూసుంటరు. దారం చేయికి సుట్టుకొన్నకొద్ది కింద జల్లెడ్ల కండెలు తల్లెడ, పెల్లెడ ఎగుర్తుంటయి. ఈ రకంగా సుట్టిన దారం పోగుల సుట్టను నానబెట్టి అరచేయికి చుట్టుకుని తొడె దాలుస్తూ దాన్ని పదునుపెడ్తూ కొందరు నిల్చుంటె తమ పని గావిస్తుంటారు. దారాన్ని పదునుపెడ్తూ ఊస గిర్రుమని తిర్గుతుంటె చూడ ముచ్చటగా వుంటుంది. అంతకుముందే షికారికి[8] పోయి, వలతో పెల్లను సదురుతూ రంధ్రాలను అతుకుతున్నోల్లలోనూ, తాటి మొగి తెచ్చి కమ్మ, కమ్మ చీరి కాల్లకింద బిగవట్టి బుట్టి అల్లుతున్నోల్లతోనూ ఇలా- రకరకాల పనులు జేసె వాళ్ళతో ఆ వాకిలంతా రోజూ కిటకిటలాడుతూ వుంటుంది.

కొత్తగా చూసేవాళ్ళకు అదొక చిన్న కుటీర పరిశ్రమలా కనబడ్తుంది. నల్గురు కూడి ముచ్చట్లాడుకుంటూ పని చేస్తుంటే పని తొందరగా దూగి అలసట కూడా ఉండదనేది అక్కడ అనుకోకుండా అనవాయితీగా వస్తుంది.

అది పెద్దోల్లకు మాత్రమే కాదు. అవాడ పిల్లలకు కూడా అట్లనే. దాగుడు మూత లాడుతున్నట్టు వచ్చిరాని ఆ పొద్దుపొడుపు కెదురు చూస్తూ నిలబడ్డోల్లు. గోటీ లాడుకొనోల్లు. అన్న మున్నసిని చూసుని ఎక్కాలు సదువుతున్న ఎండ పొడుపు సదువులోల్లు గొగ్గురోటి పండ్లు తీసుకుని తుప్ప తుప్ప ఉంచుతున్న వానర సైన్యం బాగానే జమయింది.

దీనికి తోడు ఆకాశంలో మబ్బులు[9] విడివడక పోవడంతో పక్షులు కూడా ఆలస్యంగానే తమ గూడును వదిలి వెళ్ళిపోతున్నాయి. మబ్బు ముక్క కదిలిపోతున్నట్లున్న తెల్లని కొంగల గుంపు పిల్లల కంట బడింది ఆ కొంగల గుంపుకేసి తలపెట్టి కండ్లు మూసుకుని చేతులు తిప్పుతూ "కొంగా కొంగా గోరెయ్యి - దేవుని గుల్లె రాలెయ్యి" అంటూ ఏక కంఠంతో పాడుతున్నారు. అలా పాడితే చేతి వేలు గోళ్ళమీద గీతలు వస్తాయన్నది బాల్యం యొక్క అమాయకపు విశ్వాసం.

పది మంది పిల్లలు ఒక్క దగ్గర కూడితే అల్లరి తక్కువనా! ఆ చల్లని వాతావరణంలోని ప్రశాంతతను పోరగాండ్ల అల్లరి భగ్నం చేస్తుంది.

---

6. "సకులం - మొకులం" — పీఠం వేసుకుని కూర్చోవడం
7. 'మాల్లి' నరుక్కులు — వల తయారు చేసే భాగాలు
8. 'షికారికి' — చేపల వేటకు
9 "మబ్బులు" — మేఘాలు

"దుత్....నీయవ్వ..... ఏం లొల్లిరా ఇదీ....కాకులోలె. సెవులు సిల్లులు వడ్తున్నాయి"చీ....చీ....చీ....దొగ్గుతోటి దంచి దంచి అకిలంత నశనం చేస్తుండ్రు గదరా!....మీకు ఇండ్లు లెవ్వురా. ఆడవొయ్యి ఒర్రుకొండ్రి. కీ ఇండ్లల్లకు పొయ్యి ఉండు పొండ్రహే".... అంటూ కాల్లు లేపి ఆ ఇంటి యజమాని తరిమికొట్టినంత పని జేసిండు

ముక్కిరామి (సిసినాసి కావడంతో రామవ్వకు వచ్చిన పేరది) బజ్జీల దుకాణం దగ్గర కొన్న బజ్జీలు నములుతున్న ఓ పిలుడు ముక్కు. పోరడు ఇంటి యజి మాని తరుమడంతో పెద్దోల్ల గుంపు దిక్కు ఉరికొచ్చిండు.

[10]అంగి మాత్రమే ఉండి [11]లాగులేని ఆ పోరన్ని జూసి "ఏమోయ్ మీ అయ్య బజ్జీలకు పైసలిచ్చిండు గని లాగుల కియ్య లేదోయ్" అంటూ ఓ తాత పరాషికాలాడుతున్నడు "బరిగుడ్డ[12] జామా ఇండ్లల్ల పోరా" అంటూ వికారంగా ఎగ తాళీ చేయడమే మొదలుపెట్టిండు.

"ఏహే....జెర్రాగు - నా పోరగాండ్లతోటేంది గని. ఇయ్యాల్లన్న ఓసి ద్దామా? లేదా?" అంటూ అచ్చయ్య కసురుకుంటూనే కలుగచేసుకుండు.

అచ్చయ్య గట్టిగా మాట్లాడటంతో ఎవరి పనిలో వాల్లు మునిగినోల్లంత ఒక సారి తలెత్తి చూసి మళ్ళీ యథావిధిగా పనిలో పడ్డారు.

"అరె పోశీ జెర్ర గీ బుట్టి గట్టు బిడ్డ. బుట్టి సొల్లుందిరా తమాం[13]లేదు. ఇయ్యాల్ల ఓసి ద్దె కష్టమయితదిరా" అంటూ కాలయ్య ప్రసాదిరారం రంగరించి పోచయ్య తాటిమోకు అందించాడు.

"జెర్రాగు కాక ఇంటిదాక పొయ్యొత్తనే. పొయ్యొచ్చినంక బుట్టిగట్టిత్త తెమ్మె" అంటూ పోచయ్య లేచి నిల్చున్నాడు.

"పొయ్యిరా పోరియా.... పెండ్లాం పిలుస్తున్నదేమో" మధ్యలో కలుగచేసు కొని మళ్ళీ అదే ముసలాయన పరాషికాలాడ్తున్నాడు.

"మూడొద్దుల సుండి ఓసేగదా! ముసల్దాన్ని సూసుకుంటనే కూసున్నదేమో! గందుకే నిన్న, మొన్న ఈడ కనపడలేదు" పోచయ్య అడ్డుచేస్తూనే తాత మాటకి ఎదురు సవాల్లు విసిరిండు.

"పోని పోని వాని పెండ్లం వాన్ని విడ్తదిగని నిన్ను విడ్తదా తియ్య"అంటూ మరో తాత సదిరి చెప్పుతూనే సురక అంటిస్తున్నాడు.

---

10. అంగి – బుషర్టు
11. "లాగు" – నిక్కరు
12. బరిగుడ్డ – నగ్నంగా ఉండటం
13. తమాం లేదు – అసలే లేదు

"నీయవ్వ....మీ పరాషికాలకేంది గని. ఓటి మాట్లాడె [illegible] గోటి మాట్లాడుత రేంది.... ఇంతకు ఓసిడ్సి షికారుకు పోదమా ? లేదా ? గది సెప్పుండ్రస" అచ్చయ్య తన మనోగతాన్ని కరాఖండిగా చెప్పాడు.

"నీ కెప్పుడూ అగడెనె మొయ్. ఓ ఒక్క ఓటి ఎల్లదితెయ్య" [illegible] తోడా దాలుస్తున్న రాములు మధ్యలో అందుకున్నాడు.

"అవునోయ్ నేను అగడు పడకుంటె ఎట్లానోయ్. నాకు సర్కారు కొలువు లేకపాయె - ఆమ్దాను[14] పంటల్రాకపాయె" అంటూ [illegible] సుద్దసి [illegible] వాదానికి దిగిండు అచ్చయ్య.

"అవ్వావ్.... ఎంత రామసక్కని మాట మాట్లాడ్తివోయ్" అని వెటకారంగా అంటూనే "నీకెప్పుడూ కొంచెపు మాటలు తప్ప మంచిమాట రాొచ్చినట్టూ లియ్య! అ....మనమేమన్న కాపుదానోల్లమా ఆమ్దాను పంటలొచ్చెటందుకు. నా సెప్రాసి[15] కొలువును జూసేగద నువ్వంటున్నది. ఏమన్న కలెక్టర్నయితినా, ఆఫీసు సారునయితినా? పిచ్చకుంట్ల సెప్రాసి కొలువు జేస్తేనే ఓర్వకపోయితిరి. గీ డెంపరపు కొల్వు జేసుకుంట కూడా గోసి పెట్టుకొని మీతోటి షికారి జెయ్యనే వస్తి. ఎంతయినా కొట్లనోళ్ళనిమీద పడది మన సూపు. తోటోడు జెర్ర తెల్లగుంటె ఓర్వపోతెమ. నీయవ్వ కడీనం[16] జాతి మనది. ఉచ్చల శాపలు వస్తమనేది వట్టిగ రాలేదు లియ్య." ఒక్క మాటకు పది మాటలు తిట్టి దులిపేసిండు రాము.

"అగొండ్రస....ఏం పంచాయితిరా ఇది. ఓ కడుపు నిండేది కాదు. కాలు నిండేదిగాదు. మోరుదొప్పు[17] మాటలెందుకు మాట్లాడుకుంటుడు. కడుపుల సల సలెందు కేంచుకొనుడు? ఓసిడ్సి షికారికి పోదమా! అని [illegible] బుగు శిత్తాలెందుకు మీకు? రా" అంటూ పెద్దమనిషి గద్దిస్తూనే సద్ది చెప్పిండు.

"ఏమోయ్! శెప్పోయ్....బాలయ్య బావ పోరగండ్లు షికారికి పోదసుం టుండ్రు. ఏదో సంగతి జెప్పు! ఓసిద్దుమా ? లేదా ?" [illegible] కలుగజేసు కుండు.

"సెప్పేదేముందోయ్ పెద్దబోయివి నీకు తెల్వదా! ఓసిద్దాం. [illegible] కొడుకులు పోతరు. ఇష్టమునోళ్లనెందుకాపాలె.... అ [illegible] బాయిలపొంటో కుంటలపొంటో పోమ్మని [illegible] ఇగం బెట్టుంది. చెరువుల నీల్లు కూడా గుంజలేదు. [illegible]

14. "ఆమ్దాను" — ఆదాయం
15. 'సెప్రాసి' — బంట్రోతు
16. "కడీనం" — కడు హీనం
17. "మోరుదొప్పు" — మొరటు ప్రవర్తన

మొన్న బోయి ఉట్టిగనే బుట్లాపుకుంట వత్తిమి గద. ఆ బాయిల పొంటేడ్సిన కూర సుంచమన్న దొర్కుతయి."

"గట్ల సగం మాటమాట్లాడ్తవేందే బాలయ్యమామ. ఏదోటి కుల్లకుల్ల[18] జెప్ప రాదె" అచ్చయ్య అనునయిస్తూ అన్నాడు.

"సగం మాట లేంది నువ్వద్దినే[19] బిడ్డా. నిన్నియ్యాల నించి మొదలయింది కడుపు నొప్పి. ఇంకా తగ్గలేదు. కడుపంత పుండు పుండు గుంది. నడుముకు బుట్టి కూడ కట్టచ్చెటట్టు లేదు" కడుపు అరచేయితో పుసుక్కుంటూ.

"ఏదెట్లున్నా తప్పుతుందా పగజేలి వరకు మా వోడు బడికి బొయొచ్చినంక ఆడు బుట్టి వట్టుకుంటె నాలుగడుగులు గీనిమ్మోర దాక బోయి రెండు వాప్లేసుకుని[20] వస్త." బదులిచ్చాడు బాలయ్య.

"మరి దావుఖాన్ల కన్న బొక బోయిన వెమ్మ." రాములు సానుభూతి జూపాడు.

"ఆ.... హా.... (వెటకారంగా) ఆ సర్కారు దావుఖాన్లకు వోతె డాక్టరు పట్టుకుంట, ముట్టుకుంట ఇచ్చే రంగునీల్లు దాగితే.... కడుపునొప్పివోతాది. కొంచె తనమేమో![21] ముసుపున్న గట్టకపోయినవే" రాములు సానుభూతికి అచ్చయ్య అడ్డు కట్ట వేసిండు.

"నువ్వు బొద్దంత సుట్ట సప్పరియ్యనే వత్తివి. నీకేం నొప్పి రాదుగని. నేను బాలయ్య కాక[22] గురించి మాట్లాడ్తున్న". రాములు అందుకున్నడు.

"నా కడుపు నొప్పి గురించి మీరెందుకు గొట్లాడుతర్రా అయ్య. ఇది ఇయ్యాల్ల కొత్త గచ్చిందా! ఇరువయేండ్ల కోలి దీనితోటి ఏగియ్యనే వత్తి. ఇంత సోడ బుక్కు కుంట నీల్లు తాగుతనే ఉన్న. రాత్రి ఎందుకయిన మంచిదని జిట్టి దీసి దుర్గమ్మకు ముడుపుకు ముడుపు కూడ గట్టిన. జెర్ర నుదురాయించింది. లేకుంటె ఈడ ఇంత సేపు కూసో వత్తుండెనా! నా కడుపు నొప్పుతోని మీరెందుకు లొల్లి పెట్టుకుంటర్రా అయ్యా!. ఇగ నేను లేసి ఉరుకులాడేదున్నదా గని" నిట్టూరుస్తూ.... ఆ వెంటనే మాట మార్చేసి....

"ఆ.... అ.... ఓసిడ్సి షికారికి బొదమంటిరి.... చెర్లకు పోతరా? బాయిల పొన్న వోతరా? దాని గురించి జెప్పరేమయ్య.... ఏదోటి మాట్లాడుకుంటె, ఇండ్లల్లకు వోయి ఇంత సల్లి బుట్టి ఉంటె నల్లవడా లెగద." తర్వాత అటిటు జూస్తూ

---

18. "కుల్ల కుల్ల" — స్పష్టంగా
19. "నువ్వద్దైనే" — నిజంగానే
20. "వాప్లేసుకుని" — వలను నీళ్ళపై విసరడాన్ని వాటు అంటారు.
21. "కొంచెతనమేమో" — మనుషులపై దేవుడు ఆవరించడం
22. "కాక" — చిన్నాన్న

మాంకొలె కట్టెలు మల్ల గడ్డురుగని, పెద్ద మనుసులన్న సప్పుడు జెయ్యరెందే". ఈసారి రెట్టించడం బాలయ్య వంతే అయ్యింది.

"సప్పుడేముంది గని, ఓసిడ్సి బాయిల పొన్ననే పోదాం తెయ్యండ్రి. సలికి ఇయ్యాల్ల సెరువుల దిగేటట్లున్నమా. ఇది తుఫానో.... పాడో మబ్బుల వద్దె గిట్ల సల్లగ ఈదరెందు[23] కత్తది". రాములు దిక్కు మొఖం బెట్టి "రేడియోల ఏమన్న జెప్పిండ్రటనారా రాములూ" అని పెద్ద మనిషి ప్రశ్నించాడు.

"ఆ తుఫావత్తదని రేడియుల జెప్పిండ్రటనే. నిన్న మా సార్ జెప్పంగ ఇన్న. అటు ఆంధ్ర మొఖాన్నట" రాములు జవాబిచ్చిండు.

"ఆ.... అవురా నేననుకుంటూనే ఉన్న." పెద్ద మనిషి తలూపిండు.

"కడెం దిక్కు కూడా తుఫానున్నదా! మా బామ్మర్ది కచ్చుడలలున్నాయో కొట్టుకుపోయినయో" బాలయ్య ఆత్రం గానూ, ప్రశ్నార్థకం గాను మొఖం బెట్టిండు.

"కడెం దిక్కె మోగానీ అటు సముద్రం దిక్కునోల్లకు బాగా దేంజరటనే. వలల మాట అటు వోని, వలలు, తెప్పలు ఆఖరికి మనుషులు కూడా మునిగిపోయి నత్తరట. నీ యవ్వ అల్లకయితే దీన దీన గండమటనే" రాములు చెప్పుకుపోతున్నాడు.

ఇవేమి పట్టనట్లు మాట మారుస్తూ "మీరు బాయిలు, బాయిలంటుండ్రు గని, బాయిలల్లకు పోయెతందుకు గింత కథెందుకే! ఆ బాయిల్ల ఏం దొర్కుతయని.... సచ్చేటందుకా! ఆ జెగ్గిరాల్ల బొంటి తంగ్లాడాలె. అవి వలకు దద్దె మునిగి సావాలె. అట్లయిన సలే. ఇట్లయినా సలే. షికారికి పోయేటప్పుడు సలంటే నత్తాదే.... మీదో ఇచ్చంత్రం[24] గని" అచ్చయ్య మాట మారుస్తూ కలుగజేసుకున్నడు.

"ఆ.... సలిదేముంది గని.... బాయిలో, చెఱువులో, అంద్లే ముంది ఇంద్లే ముంది. ఓసిడ్సి ఎటు పొయేటోల్లు అటు పోదమని అనుకుందాము. యాడికి వోయిన కూరజిమ్మలు[25] దొరికితే మా యెక్కువ. కాలం గాని కాలంల అనుకుంటె మాత్రం ఏ మొత్తది. ఇదేమన్న ఎనుకటి కాలమా.... అప్పుడైతే ఈ కాలంల వాగులల్ల, బంరెలల్ల ఏడవద్దె ఆడ అడ్మాసు నీల్లు. ఎగిలివారక ముందే[26] లేచి తొపెల వట్టు కొని పోతే ఇన్ని గిచ్చులో ఉలిశెకొక్కులో[27], దొరుకుతుండె. మబ్బుల వోయి

---

23. "ఈదర" — చల్లగాలి
24. "ఇచ్చంత్రం" — విచిత్రం
25. "జిమ్మలు" — చేపలు
26. "ఎగిలి వారక ముందె" — వెలుగు పారకముందే (ప్రాతఃకాలం)
27. "గేచ్చాలు, ఉలిశె కొక్కులు" — చేపలలో రకాలు

వణుకు వట్టినందుకు ఇంత పాయిదన్న[28] ఉంటుందె". బాలయ్య తనకు తెలీయ కుండా వర్తమానం నుండి గతంలోకి వెళ్ళిపోయాడు.

"పాయిదనా.... దాని గురించి మాట్లాడెటట్లున్నామే. పురాగ కూరకు తక్లి[29] బుందిగదనే. మనమేమో కోమటి బావనోల్లం గాకపోతిమి కాయగూరలు కొనుకొచ్చు కోవడానికి" అచ్చయ్య అందుకున్నాడు.

"కొందమంటె అవ్వేమన్న అగ్గు[30] వున్నాయి. అగ్గి మండినట్లు మండు తున్నయి. రోజూ నాలుగు పర్కలో మొయ్యలో[31] అందుకునే బొల్లం మన కెక్కడేర్ప డ్తది గని. నిన్న మావోడు మూడొద్దుల చాపల పులుసు తిననని ఏడ్తె, ఐదు రూపాలు పెట్టినా కంకెడు కంకెడు కాయగూరలు రాలేం.... అండ్ల కిన్ని అట్టి శాపలెయ్యకుంటె మనకేమన్న రుచుంటదా! పాడా. ఎండ్ల జూసిన చాపలే ఏత్తరని మావోడు అల్గితే.... మర్రగై కిలోని వారా? అని మూడు దొబ్బి నాల్గు కొన రేసిన" ఆవేదనలోనే కుల గొప్పతనాన్ని చాటాడు బాలయ్య.

"మరిగ ఆల్సెమెందుకే. ఓ గోస పొరన్ని పిలువుంర్రి". అంటూ అక్కడే ఉన్న ముక్కు చీముడు పొరని తోటి "ఓరి పిల్లగా గా అంజిగాన్నిటు పిల్చుకరా పోరా" అంటూ పెద్ద మనిషి పురమాయించాడు.

"అంజన్నేడన్నడు తాతా" అంటు ముక్కు ఎగ జీదిండు పోరడు.

"అదీ గూడ నేనే దేవులాడి[32] జెప్పనార్రా పొడ. నీకు కండ్లు దొబ్బి నాయిరా" అంటూ అటుగా చూసి "అగో అచ్చయ్యోల్ల గైండ్లున్న పో" అనంగనే పొరడు అక్కడి నుండి తుర్రుమన్నడు.

"అంజన్నా! నిన్ను కులపోల్లు పిల్తుండే" అని పోరడు పిలువంగనే అంజన్న క్షణంలోనే అక్కడ వాలిండు.

వచ్చీ రాగానే "ఏందే తాత! ఎమో పిలిచింర్రట" అంజిగాడు అనునయంగానే పలికిండు.

"అరెయ్ వారీ ఇయ్యాల్ల ఓసి ద్తున్నం. ఎటోల్లటు షికారి పోవచ్చని చెప్పిరా పోరా" అంజిగానికి పెద్దమనిషి పని అప్పజెప్పిండు.

"పొత్తుల్నా? వేరా? ఎట్ల జెప్పు మంటరె- మళ్ళీ గోసపోరడే ప్రశ్నించిండు.

"ఎవలకు వాల్లె బాయిలకు, చెరువులకు ఎక్కడికన్నా పోవచ్చని చెప్పిరా పో" అంటూ బాలయ్య సర్ది జెప్పిండు.

---

28. "పాయిదన్న" — ప్రయోజనమన్న
29. తక్లీబు — ఇబ్బంది
30. "అగ్గువ" — తక్కువ ధర
31. "పర్కలు, మొయ్యలు" — నాసిరకం చేపలు
32. "దేవులాడి" — వెతికి

"పో.... వెళ్లి చెప్పిరా పోరా.... ఇక్కడే నిలబడ్తె పెట్టి కొలుస్త" పెద్దమనిషి అసహనంగా కదిలాడు.

"మంచిది చెప్పత్తగాని. అడివెల్లి రెండే నా ఒక్కని కాదు నాయి... ఇంకెవల్నన్న దోలుంద్రే. ఇద్దరం చేరో దిక్కుపోయి చెప్పి వెప్పెత్తం". అంజి గాడు నసుల్తా అక్కడే నిలబడ్డాడు.

పోరడు ఆలస్యం జేస్తే షికారి ఎటుపోయి ఎటొస్తవోనని ఆందోళన పడ్తు "ఏమాయెరో ఈడు ఇంకా కదలడేమిరో. చిన్నగాళ్ల మొన్న ఉసెత్తె లేడు. సని జెప్పితె వంగవేమిరో. పోరనికి సిగ్గులె అస" అచ్చయ్య అసహనం శృతి మించు తుంది.

"ఓయి సీల్గుడు, గీల్గుడు మాట్లాడకు. అగో మీ కనకడు ఇటే వస్తుండు. వాన్ని కూడ పంపరాదు. వాడు నాలెక్క గోసిరెచె గద."

అంజిగాని మాటలకు అచ్చయ్యకు అరికాలు మండినా తన కొడుకు పేరెత్త గానే కొంచెం ఎనక్కి తగ్గి మాట మారుస్తూ "ఇప్పటి పోరగాండ్లకెమైన చెప్పెట ట్టుందా" వేదాంత ధోరణిలో నిట్టూర్చాడు అచ్చయ్య.

ఇంతలోనే పెద్ద మనిషందుకుని, "సికాలుపేందిర నడు ఇల. పో.... వెళ్లి పోయి చెప్పిరా.... పో" అంటూనే అటుగా వచ్చిన కనకయ్యతో "అరె కనకా చెరో దిక్కుట పోయి ఓసిడ్సినట్లు జెప్పిరా పోండ్రా" అనగానే అక్కడి నుండి కదిలి పోయారు.

మరొకరైతే కన్కడు మోటారు పని కాడికి పోతడని చెప్పేవాడే. కానీ పెద్ద మనిషి మాటలతో పాటు షికారికి పోవాలనే ఆత్రంలో అచ్చయ్యకు నోట మాట రాలేదు. ఓసిత్తమని తొందరైతె పెట్టిండుగని, పొద్దంత తిరిగినా నాల్గు బొక్కలు కూడా దొర్కయని బాలయ్య మామ చెప్పిన మాటలు చెవులల్ల గిర్రున తిర్గుతూనే ఉన్నాయి.

'ఇంట్ల గూసుని కూడా ఏంజేసుడు. మూడొట్టులసుండి ఓసెనాయే. వల, గిల సర్దె పనులన్ని అయిపోయె. మాంకాలెగట్టి ముందటేసుకుని ఎంతగనం చూసో వత్తది. పనిజేసిన పాకానికి పొల్లుజెయిలు ఆడనుంటి కట్టేసినట్లు ఉంచే. సరి ఈదరకు తోడు పనిలేక పాణముకూడా ఉషారు లేదు. తన పనిలోనే అపసరాలన్ని నెమరేసుకుంటుండు అచ్చయ్య.

దాదాపు అక్కడ కూర్చున్న వారి అందరి పరిస్థితి అలాగే ఉంది. చాపలమీద బతుకడం తప్ప, ఎవరికీ చెప్పుకోతగ్గ పొలాలు లేవు. కాలం మంచిగయి చెరువు, కుంటలు నిండితేనే కాల్జెయ్య ఆడుతది.

ఇక బాలయ్య పరిస్థితి చెప్పేదేముంది. చాతనయినోల్లు పోంగ్రి బిడ్డా అన్నడు గాని, తనకు చాతగాకున్నా షికారికి పోకుంటె ఎల్తదా అని తన మనసులోనే నెమరేసుకుంటుండు. కూరమందమే అన్నడుగని పాయిందేస్నాల నుండి[33] కొడుకు నాయినా పరిచ్చ ఫీజు గట్టాల్నేలని అడ్గుతనే ఉన్నడు. ఇస్కూలు బట్టలు గూడ చినిగిపోయినయి. భూమి జాగ ఎనుకాముందు ఏమి ఆస్తాను లేకున్నా పిల్లల్ని సదివి పిత్తుండుగని, సదువులంటె ఉట్టిగనే ఐతాది! సరుకారు బడయినా ఓ బట్ట లేకుంటె ల్తదా, బాతలేకుంటె ల్తదా! ఆఁ.... వయిలుగా[34] మన్నాయె, పెన్నులు గావాల్నాయె, సెప్పులు గావాల్నాయె. ఆ రొక్కటి రెక్కల కట్టమ్మీదనే కొనాల్నాయె. చెరువు కింద పొలం లేదాయె. పెద్దలు గూడపెట్టిన ధనం లేదాయె.

తన మనసులో రేగిన ఈ ఆలోచనలన్నీ కదిలి "ఎన్నోద్దులో ఇంకా ఈ తిప్పలు" అంటూ పైకే మాట్లాడి, "పొద్దు మూలక్కనే ఐంది. ఇంత సల్లవడన్న వస్త." అంటూ లేవడంతో ఒక్కొక్కరు ఇండ్లల్లకు పోవడానికి సర్దుకుంటుండ్రు.

ఓసిప్పిన సంగతి తెల్వనోల్లందరికి ఇల్లిల్లు తిరిగి చెప్పుతున్నారు గీస పిల్లలిద్దరు.

"ఓ మైసయ్య తాతో... ఓ.... తాతా...." ఓ ఇంటి ముందుకు పోయి అంజయ్య కేకవేస్తూనే ఉన్నాడు.

"తాత లేడుగని ఏంమతులాబోయి[35]" అంటూ ఇంటెనుక బోల్లువోముతున్న సెంద్రమ్మ బయటకువస్తూ అడిగింది.

"ఇయ్యాల ఓసిడ్సిండ్రు. ఎవరికి వాల్లే ఎటన్నా షికారికి పోవచ్చని తాత రాంగనే జెర్రశెప్పమ్మా" మాట ముగిస్తూనే అంజయ్య వెనక్కి మల్లాడు.

"ఆగోయి పిల్లగా.... పెద్దబోయి వెప్పుడయితెవి." కొంటెగా అడిగింది చెంద్రమ్మ.

"మొన్ననే గీ సెత్తుకున్ననమ్మ." పొడిపొడిగానె అంజులు సమాధానం వచ్చింది.

"మీ అక్క వీల్లాడిందటన."

"ఆఁ.... ఆఁ.... మొన్ననేనట. కొడుకు వుట్టిండేని మా బావొచ్చి చెప్పి పోయిండు."

---

33. "పాయిందెస్నాల నుండి" — పదిహేను రోజుల నుండి
34. "వయిలు" — పుస్తకాలు
35. "మతులబు" — సంగతి, కబురు

"మరి పెద్దోనివఋతివి. తోసెలవ డ్తివి. నీ లగ్గ[36] మెప్పదోయి. జల్ది బిడ్డను గను" అంటున్న చెంద్రమ్మమాట లింటూ.

"ఆ....గదొక్కటి తక్కువ ఉం"దంటూ పెదవి విరుస్తూనే కదిలిపోయాడు అంజయ్య.

అప్పుడే బావనోల్లిండ్లల్ల బాసండ్లు దోమి అన్నం గంప వట్టుకుని వస్తున్న మల్లమ్మ "ఏమోయ్ అంజాలు! మాట్లాడుకుంట పోతున్నవు" నిలేసి పలకరించింది.

"ఏంలేదమ్మా ఓసిడ్సింద్రని జెప్పత్తున్నా."

"నీ సదువేమాయెనోయి మరి."

"ఆ ఇగ సదుపు సాకిరికి వడ్డదై."

"మీ అవ్వ ఇయ్యాల్నల్ల లేసి బుక్కెడంత సల్లవడ్డదా ? లేదా ?"

"ఆ....ఇయ్యాల పొద్దుగాల్లేసి ఉడుకునీల్లతోటి మొఖం కడ్గిపిచ్చిబల్మీటికింత[37] శాయ దాగి పిచ్చింటిమి" గుండె తేలిక జేసుకుంటూ అన్నే నిలవడ్డడు అంజయ్య.

"నలుగుర్ని పిలిచి చెప్పుంద్రి. ఇట్టమొచ్చినట్లు దాగి ఎటువడ్తె అటుగొడ్తె. కాని కాడ దగుల్తెట్ల. సంటి పొరగాండ్లంత ఆగంగారా !.... !.... పంది గన్నట్లు పదిమందిని గంటే ఆయిపోతాది." అంజయ్య తండ్రి గురించి మల్లమ్మ నిష్ఠూరాలాడింది.

"తాగకుంటె మంచిగనే ఉంటడమ్మ. ఒక్క సారాసీస వడ్డదంటె.... మన మనిషిగాడు. మా బా వచ్చి దొబ్బులు దొబ్బితే నిన్ననంగ పోయిండు .... ఇంకా పత్తాలేడు."

"ఆఁ....గిట్లనా! పొరగాండ్లకు పొరగండ్లయిరి. ఇంక నస్సనొయిలేదా ! తొల్సారి కానుపు తల్లిగారింటికి తోలుకొచ్చుకోవాల్సింది పోయింది.అల్లుడచ్చెటాల్లకు పెండ్లాన్ని ఎక్కడికక్కడ తన్ని పండవెడ్తె....నలుగుల్లె జెప్పుకుంటె....ఒవ్వ (చెయ్యితో నోరు మీద గొట్టుకొని) సిగ్గుపోతది...."అంటూ కొంచె మాగి "కులంల జెప్పనుంటిరోయి." సూచన లిచ్చింది మల్లమ్మ.

"బాలయ్య తాతతోటి జెప్పిన—కులంలనడి దరఖాస్తు పెడితే నూరురూపాలు జుర్మానేత్తరు. తాగి ఉచ్చవోత్తరు. ఆ పైసలెవడు గట్టాలె. నలుగుట్లవడి ఇజ్జ తెందుకు కరాబు జేసుకోవాలె.... అయినా కుక్క తోకకు గుండు గడితె సక్క గైతాదమ్మ" పదిహేనేండ్లల్ల అంజయ్య మాటలకు మల్లమ్మ ఆశ్చర్యపోయి కండ్ల నీల్లు దీసుకున్నది.

---

36. "లగ్గం" — లగ్నం — పెళ్ళి
37. బల్మీటికి — బలవంతంగా

"నువ్వన్నది గూడ నిజమేగని....ఏం జేస్తం. ఎంట్ల రాసుంటె గట్లయితదిగని. జెర్ర మీరన్న తెలివికొచ్చి సంసారాన్ని తొవ్వల వడగొట్టుండ్రి." అంజయ్య మనసు తేలిక పరిచింది మల్లమ్మ.

"మంచిది. పొద్దు వోతుందమ్మా. ఇంకా దీటోల్ల వాడి దిక్కు పోయి చెప్పా" లంటుండగానే చెరోవైపు కదిలిపోయారు.

వెళ్ళిపోతున్న మల్లమ్మ మళ్ళీ వెనక్కు తిర్గి "మరి ఆతకు చెప్పినావోడు" అని పిలిచింది.

"అ....అ....తాత అన్నేఉందె...." అని చెప్తూనే అంజయ్య కనుమరుగైనాడు.

"దీటోల్ల వాడకు పోయేసరికి అడ పెద్దరొల్లిపెడ్తూ వాడంత ఓటి జేస్తుంది దీటాశమ్మ.

"మర్యాద కొద్దిజెప్తున్న రాత్రి నా కోడి నా ఇంటికి రాలేదు. ఎవనింట్లనో వడ్డది.... ఎవడో దర్మం గట్టుకున్నడు....నేను రాత్రి అగంత సరిగ జూడకనే కమ్మిన. పొద్దుగాల జూత్తె కోడి లేదు. నిన్న పొద్దుగూకె జాముల మా సెంటల దవ్వుకోంగ జూసిన."

"గింత మాయిల్లమే[38] ఏ దొంగలు రాలేదు. ఏ లంగలు రాలేదు. ఎవ్వడు సర్దిగట్టుకోనచ్చినా కోడిపెట్ట నెత్తుక పోలేదు. ఎవ్వలో దగ్గరోల్లే గమ్మింద్రు. ఆడిదో, మొగోడో....ఎవ్వడు వట్టినా నా కోడి నిడ్సి పెట్టాలె."

"కట్టపడి సాదుకోవాలెగాని ఊరు మీది సొమ్ము గదింటె ఉట్టిగ వోదు. నా బంగార మసొంటి కోడి మీద ఎవని కండ్లువడ్డయో... ఎవతె కండ్లు వడ్డయో. ఆల్ల కండ్లల్ల కంపలు వడని, ఆల్ల కండ్లల్ల జిల్లేడ్లు మొలవని....అల్లు సత్తె నాశనమయి పొవట్ల కొట్టంగానీ...."

"ఓ యవ్వో అది గుడ్ల కచ్చినపెట్టనే. రెండు నెల్లయితె మున్నూరు సంపాయించేది. నా కోడిని జాసి ఓర్వలేదు. ఆ కోడి దింటె నా బగుల తిన్నట్టె."

"దాన్నియ్యాల ఏడగమ్మినా ఇడ్సి పెట్టుండ్రి. కోస్తి రాంటె మర్యాద దక్కదు. కోడిని పోచమ్మ కిడ్సిపెట్టిన ఆ దేవుని దింటె పాపం దల్గుతుంది. రక్తం గక్కి సచ్చిపోతరు. అల్లను పోశమ్మ మింగుతది.ఆల్లనోల్లె పొక్కులు వొత్తయి."

మల్లెచ్చె దినం కల్ల ఆ కోడి సచ్చినట్టె ఇల్లు సత్తరు. మంది సొమ్ము దిన్నోనికి అయ్యత్తదా....! సా.... దాగాలె.... కండలు దినాలె...."

అటూ ఇటు దిర్గుతూన్న ఆశమ్మ నోటి నుండి బూతులు ఇంకా శృతి మించు

---

38. "మాయిల్లమే" – మహాఎల్లమే – ఇంత తొందరలోనే

తున్నయి. అడ నిలబడి నోరు పెల్లబెట్టి చూస్తున్న అంజయ్య ఇగ లాభం లేదనుకుని "ఓ ఆశమ్మత్త ఓసిడ్సింద్రు. ఎటన్న వొమ్మని మాపుకు జెప్పు" అంటూ కేకేసి, ఆమె సమాధానం వినకుండానే అంజయ్య మరో ఇంటికి పోయాడు.

"ఏం షికారో ఏమో పో.... అందరు వోతె ఆయన వోతడు. నా బంగారవు సొంటి కోడి పోయింది." అంటున్న ఆశమ్మ నిష్ఠూరాలు చాలా దూరం వరకు అంజయ్యకు వినిపిస్తోనే ఉన్నాయి.

అంజయ్య తోటి "ఏం షికారో ఏందో పో" అని అననైతే అన్నది గని ఇంతటి బాధలో కూడా "ఏమయ్యో ఓసిడ్సింద్రట. షికారికి పొయ్యేలోపు అడీడ నాల్గు దిక్కుల సూశి రా పో. ఇండ్లేము జేత్తున్నవు.... గుడ్లు పెడ్తున్నవా?" పెనిమిటి దిక్కు జూసి లాసిగానే మాట్లాడ్తుంది ఆశమ్మ.

ఇంకో సారయితే ఏమో లావు లావు మాట్లాడ్తున్నవేందే అని లస్మయ్య గద్దరిచ్చి పెట్టెటోడె.... గానీ ఆశమ్మిప్పుడు వినే ఆశలో లేదు. తీవ్ర నిరాశలో ఉంది. అందుకే లస్మయ్య లోపల్లోపల గుల్గిండు.... గని బయటకు సప్పుడు జెయ్య లేదు.

పాపం అంతటి దుఃఖంలో కూడా ఆమె షికారి కర్తవ్యాన్ని పెనిమిటికి గుర్తు చేస్తూనే వాడనైతే ఆడిపోసుకుంది గని, కోడి సడకు[39] మీదికి పోతె బయటోడు ఎవ్వడన్న పట్టుకున్నారా, అని అమె అనుమానిస్తూనే ఉంది.

ఇయ్యాల్ల ఓసిడ్సింద్రని తెల్వంగనే వాడ కట్టంతి తిరిగి కదలిక లోనికి వచ్చింది. రోడ్లమీద వాకిళ్ళలో కూర్చుని పనులు జేసుకుంటున్న వాళ్ళంతా ఎవరిండ్లల్లకు వాల్లు పెల్తున్నారు. సలిదో, బులిదో దింటూ షికారికి పోవడానికి సిద్ధమవుతున్నారు.

ఓసిడ్సిన తర్వాత నాల్గు జిమ్మలు దొరికినా, దొర్కకున్నా కోసుల పెట్టయినా పోయి సాయంత్రానికల్లా ఈడ్సుకుంట ఇల్లు జేరడం మామూలె.

చాపలు దొరుకని కాలంలో ఇంట్లో కూడా అనాదరణ షరా మామూలే. అచ్చయ్యింట్ల జర్గుతున్నదదే. అంట్లు దోమచ్చిన ఆడోల్లు పుదురు కలుపులకు పోవడానికి అరాట పడ్తున్నారు.

"బువ్వేయ్యే".... అన్న అచ్చయ్య "ఏసుకుని తినరాదు అడ కల్వల కాల్లయితుంది. అల్లంత పోతే మల్లుత్తగానే ఉండాలే". అ ఇంటామె సమాధానం ఇస్తూనే తన పని చేసుకుంటుంది.

---

39. సడకు — రోడ్డు

"ఇంత కూడు పెట్టెటాల్లకే నీకు యాల్లయితున్నాదే.... నీ యవ్వ.... సర్కారు కొలువు లెక్కనే జెయ్యవట్టివెమ్మే...."

"అ(.... ఇగ నీవు జేత్తునవు.... మాదండి కొలువని, నేను జెయ్యకపోతి... కొలువు.... కొలువట. ఇగ ఊపుకుంటపోతె బుట్టి నిండుతది పో...."

"బుట్టి నిండి నపు దెవలకు జెప్పినవే...." అంటూ అచ్చయ్య కుండలన్నం పెట్టుకొని కస్పపిస్స రెండు బుక్కలు తిని ఎదురు సొలేసుకుని[10] చెరువు దీపి నీక్కు తొవ్వ దీసిండు.

కొడుకు బిడిరెల్లి రాంగనె వల దీసుకుని "పోశన్న బుట్టి గట్టిండు తీసుకురా పోరా!" అంటూ కొడుకుని గెదిమి నిమ్మోర కుంటకు దారి తీసిండు బాలయ్య.

"కడుపు నొత్తుందటివి ఇయ్యాళ్లాకోరాదే నాయినా" అంటున్నా ఆగకుండ నడుస్తూనే ఉన్నాడు. వెంట నడ్వడం కొడుకు వంతయింది.

సైకిళ్ల మీద, నడ్సి ఎట్ల వోయెటోల్లు అట్ల షికారికి పోతునే ఉన్నారు. సైకిలెక్కి రాములు సంది తొవ్వలో నుండి బయలు దేరిండు.

ఓసిద్వంగనే కోసుల పెట్టి నడ్వడం రెక్కలిర్సుకోవడం, బుట్టి నిండితె అలసటలోనూ ఉషారుగా, లేకుంటె నీరసంగా ఇల్లు చేరడం మామూలె. ఆ ఊర్లో ఎన్నో తరాలు షికారుచేసి బతుకుతున్నా వారి బతుకు గొర్రె తోకల్లా పెరుగనే లేదు.

"ఒసిడ్సినా వాళ్ళ బతుకు పట్టిన పేదరికం శని నేటికి విడువలేదు".

---

10. ఎదురుసోల — వలల్లో ఒక రకం వల



"ఓసు"— ఎవరూ చేపల వేటకు పోవద్దని విధించుకునే కట్టడి. ఓసుండగ వేటకు పోవడం కుల ధిక్కార నేరమవుతుంది.


## వెలువడింది

### "గతితర్కం - అంబేడ్కరిజం - మార్క్సిజం"

డా॥ కంచె ఐలయ్య, డా॥ కె.యస్. చలం, డా॥ కె. చక్రధరరావుల ముందు మాటలతో

బి.యస్. రాములు, శరద్‌పాటిల్, భరత్ పతంకర్‌ల వ్యాసాల సంకలనం.

వెల : రు 20-00 ప్రతులకు: మైత్రి బుక్‌హౌస్, మసీదువీధి కారల్‌మార్క్స్ రోడ్ విజయవాడ-2

# ప్రేమకు నిర్వచనం అమరత్వం

జీవితాన్నెంతగా ప్రేమిస్తానో
మరణాన్నంతగా ద్వేషిస్తాను
మరణం అనివార్యమయితే
ఎదురొడ్డి పోరాడేవాణ్ణి
ప్రేమిస్తాను
ఎవరైతే సూర్యున్ని దోసిట్లో పట్టి
జీవితాలకు వెలుగు నిస్తారో
వారిని ప్రేమిస్తాను
తొలకరి జల్లుతో మట్టి ఇచ్చే వాసనను
మట్టిని నమ్ముకొన్న మట్టి మనుషుల్ని
అమితంగా ప్రేమిస్తాను
'అ' 'ఆ' లతో అనంతార్థాలను
విశ్లేషించే వారిని ప్రేమిస్తాను
ఉక్కు పాదాల త్రొక్కుడి బలవన్మరణ ప్రసాదాలు
మూలుగుల చప్పుడు సైతం
వినపడ కూడని కాలంలో
అరణ్య నేత్రాన్ని తెరిపించి
ఎక్కడెక్కడో ఒరిగిపోతున్నపుడు
పేగు కదల కుండా వుంటుందా
చిప్పిల్లిన కళ్ళతో దృఢంగా లేచిన
పిడికిలిని చూస్తే
కసి ఏదో కొట్టొచ్చినట్లు కన్పించడం లేదూ?
అందుకే
ప్రేమకు నేనిచ్చే నిర్వచనం
అమరత్వం

— చిన్ని

## త్రిప్పికొట్టండి - డంకెల్ డ్రాఫ్టును

డంకెల్ గాడు.... దొంగల రేడు
దళారి గాడు — దోపిడి గాడు
అందిన కాడికి దోచుకు తిన్న
అమెరికోడికి దోస్తి రన్న
మోసపోకురా రైతన్నా
డంకెల్ డ్రాఫ్టుకు నీవన్నా

నెత్తురు చిమ్మి రైతన్నా
నేలను దున్ని రైతన్నా
పుట్టలు గొట్టి రైతన్నా
గట్టులు పోసి రైతన్నా
ఎండలో ఎండి రైతన్నా
కుండలు తోటి రైతన్నా
నీరు పోసినావు రైతన్నా
నారు కోసమని రైతన్నా
విరుడు దాచిన రైతన్నా
విత్తనాల మీద రైతన్నా
పెత్తన మాడికి ఏలన్నా ॥డంకెల్॥

పిల్లా జల్లా రైతన్నా
కలుపు తీసి రైతన్నా
మొక్క కోసము రైతన్నా
మొక్కు కున్నవు రైతన్నా
పంట కోసము రైతన్నా
పండగ జేసి రైతన్నా
ముందు చూపుతో రైతన్నా
మందులు గొడితె రైతన్నా
ఏపుగ సేను రైతన్నా
పెరగాలనీ రైతన్నా
ఎరువులు కొంటే రైతన్నా
పేటెంటు హక్కుతో రైతన్నా - పాడుచు తింటాడు వాడన్న ॥డం॥
పండిన పంటకు రైతన్నా
గిట్టుబాటు లేక రైతన్నా

చేసిన కష్టం రైతన్నా
చేతి కందక రైతన్నా
అప్పులు తోటి రైతన్నా
తిప్పలు పడితే రైతన్నా
సబ్సిడీలకు రైతన్నా
ఎరువులు మందులు రైతన్నా
చెత్తా చెదరము రైతన్నా
ఇస్తామన్నారు రైతన్నా
ఇచ్చేది కూడా రైతన్నా
ఎగనామం ఇక నీకన్నా ॥డంకెల్॥

దగా పడకరా రైతన్నా
దళారి దేశం రైతన్నా
పాలక వర్గం రైతన్నా
పెద్ద దళారి రైతన్నా
పొంచి పొంచి వున్న రైతన్నా
సంపన్న దేశాలు రైతన్నా
దేశం మీదకి రైతన్నా
దిగిపోనాయి రైతన్నా
మన్ మోహన్ రైతన్నా
మంచి నాడురా రైతన్నా
నరసింహారావు రైతన్నా
అమ్మేసాడు నీకన్నా ॥డంకెల్॥

పస్తులు వుండి రైతన్నా - శిస్తులు గడతావు రైతన్నా
కడుపు చంపుకొని రైతన్నా - కూడు పెడతావు రైతన్నా
నీ కష్టం మీద రైతన్నా - నీకు లేని హక్కు రైతన్నా
నీ దేశం మీద రైతన్నా - నీకు లేని హక్కు రైతన్నా
వాడికెందుకు రైతన్నా
హక్కుల కోసం కలబడు
బాధ్యతగా నీవు నిలబడు ॥డంకెల్॥

— నిశితాసి

ఇది రాహుల్జీ శత జయంతి సంవత్సరం :

# జాతీయ భాషా చర్చ-కమ్యూనిస్టు పార్టీ - రాహుల్జీ పాత్ర

— సుధీ ప్రధాన్, కలకత్తా

(రాహుల్జీ శతజయంతి సందర్భంగా కా॥ సుధీప్రధాన్ రాసి పంపిన వ్యాసం. ఇందులో ప్రస్తావించిన విశిష్ట విషయాల మూలాలలోకి వెళ్ళి, సమగ్రమయిన పరిశీలన చేయాల్సిన, చర్చించాల్సిన అవసరం వుందని ప్రజాసాహితి భావిస్తోంది. అదే సందర్భంలో రాహుల్జీ ఒక హిందీ భాషా ఛాందసుడుగా లేడని ఈ వ్యాసం స్పష్టం చేస్తోంది. సం॥)

ఈ క్రింద పేర్కొన్న లక్ష్యాలను సాధించే విధంగా సాహిత్యాన్నీ, కళలనూ, సంస్కృతినీ అభివృద్ధి పరచే చర్యలను రూపొందించడానికి, 195- ఏప్రిల్ 7, 8 తేదీలలో ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీకి చెందిన సాంస్కృతిక కార్యకర్తలు కలకత్తాలో సమావేశమయ్యారు.

మొత్తం దేశంలోని ప్రజాతంత్ర ప్రజానీకపు సాధారణ ఆకాంక్షల కనుగుణంగా, ప్రతి జాతీ, గిరిజనులతో సహా తమ భాషనూ, సంస్కృతినీ తమ తమ పద్ధతులలో అభివృద్ధి చేసుకోడానికి సహాయపడటం-

—వారు తమ జీవన పరిస్థితులను మెరుగు పరచుకోవడానికీ, తద్వారా తమ జీవితాన్ని సంపద్వంతం చేసుకోవడానికీ జరిపే పోరాటాల్లో వారికి సహాయపడటం-

—కులాల్ని కూలగొట్టడానికీ, మత, కుల ద్వేషాలనూ, పక్షపాత దృష్టిని రూపు మాపడానికీ, భూస్వామ్య బూర్జువా వర్గాలు సంప్రదాయ సిద్ధంగా నేర్పిన భయాలనూ, దాసత్వానికీ, మూఢ నమ్మకాలకూ సంబంధించిన భావజాలాన్ని అంతమొందించడానికి సహాయ పడటం.

ఇవిగాక అన్ని దేశాల ప్రజలతో సోదరత్వ భావనను పెంపొందించడమూ, సామ్రాజ్యవాద యుద్ధ ప్రచారాన్ని నిరుత్సాహ పరచడమూ ప్రధానంగా ఇతర లక్ష్యాలుగా ఆనాడు నిర్ణయించుకున్నారు.

సి.పి.ఐ. కేంద్ర కమిటీ తరఫున ఈ సమావేశానికి కామ్రేడ్ ఎస్.ఎ. డాంగే హాజరయ్యారు. ఈ సమావేశంలో ఎన్నో ముఖ్యమైన నిర్ణయాలు తీసుకున్నారు. దానిలో ఒకటేమిటంటే, హిందుస్థానీ మాట్లాడే ప్రాంతాల్లోని పార్టీ సాంస్కృతిక కార్యకర్తల సమావేశాన్ని ఏర్పాటు చేయాల్సిందిగా కేంద్ర కమిటీని కోరడం. ఆ సమావేశం హిందీ- ఉర్దూ వివాదం చర్చించాలని కోరింది. ఈ వివాదంపై ఒక నివేదిక తయారు చేసి ఇచ్చే బాధ్యతను డా॥ రామ్ విలాస్ శర్మ, డా॥ అబ్దుల్ అలీమ్

లతో కూడిన కమిటీకి అప్పగించి, ఆ కమిటీ ఇచ్చే నివేదిక సహాయంతో పైన కోరిన సమావేశాన్ని నిర్వహించాలని కోరారు.

దీనికి అనుగుణంగా, అలీ సర్దార్ జాఫ్రీ కేంద్ర సాంస్కృతిక కమీషనర్ కన్వీనర్‌గా, ఒక సబ్ కమిటీ తయారు చేసిన 'హిందుస్థానీ దేశము- దాని జాతీయ భాష' అన్న సమస్యపై ఒక ముసాయిదాను ప్రచురించారు. ఈ సబ్ కమిటీలో డా॥ రామ్ విలాస్ శర్మ, డా॥ ఎ. అలీమ్‌ల పేర్లు తప్ప మిగిలిన సభ్యుల పేర్లు ఆయన (కన్వీనర్) ప్రస్తావించలేదు.

ఈ ముసాయిదా ఉత్తర భారతదేశంలోని లిపుల యొక్క, భాషల యొక్క చారిత్రక అభివృద్ధి క్రమాన్ని వివరిస్తూ సుదీర్ఘంగా సాగింది. "హిందీ-ఉర్దూలు సారాంశంలో ఒకే భాష క్రింద వస్తాయి. భవిష్యత్తులో అవి ఒకే భాషగా రూపొందక తప్పదు" అనే అంతిమ నిర్ణయాన్ని ఆ ముసాయిదా ప్రకటించింది. ఈ విషయంలో చీలికను సృష్టించిన బ్రిటీషు వారి పాత్రను వర్ణిస్తూ, హిందీ భాషను బలపరచిన శ్రీపురుషోత్తమదాస్ టాండన్ 1919 నాటికికూడా ఉర్దూలో రాయడాన్ని ఏవగించుకో లేదన్న వాస్తవాన్ని హిందీ భాషా సమర్థకుడైన మహా పండిత రాహుల్ సాంకృత్యా యన్ 1920-23 సంవత్సరాలలో తనకు నచ్చిన ఉర్దూ కవితలను తన డైరీలో రాసుకునేవాడన్న వాస్తవాన్ని ఆ ముసాయిదా మరీ మరీ నొక్కి చెప్పింది. (రాహుల్ డైరీ- మేరీ జీవన యాత్రా- అలహాబాద్- 1946, పేజీ 479 చూడండి.)

ఆ ముసాయిదా ఇంకా ఈ క్రింది విషయాలను తెలియ చేసింది. భారతదేశ విభజన తర్వాత హిందీ సాహిత్య సమ్మేళన్ నాయకులు ఉర్దూకు వ్యతిరేకంగానూ, 'హిందీ-హిందూ-హిందుస్థాన్' అనే నినాదానికి అనుకూలంగానూ ప్రచారం ప్రారం భించారు మరో పైపు, ఉర్దూ అభ్యుదయ రచయితల్లో ప్రముఖులు జోష్ మలీహా బాదీ, కిషన్ చందర్, ఇస్మత్ చుగతాయి, కె.ఎ. అబ్బాస్, మజాజ్, కైఫీ ఆజ్మీ, అలీ సర్దార్ జాఫ్రీలు అలహాబాద్‌లో సెప్టెంబర్ 1947లో జరిగిన హిందీ రచయి తల సమావేశానికి పంపిన సందేశంలో ఇలా ప్రకటించారు.... "హిందీ భాషలోనూ, ఉర్దూ భాషలోనూ రాస్తున్న అభ్యుదయ రచయితలమైన మేము జాతీయమైన, సాంస్కృతికమైన ఐక్యతను విశ్వసిస్తాం. కనుక హిందీ, ఉర్దూ భాషలను మేము హిందుస్థాన్, పాకిస్తాన్‌ల లాగా విడదీయ లేము. మన భూభాగం భౌగోళికంగా ప్రస్తు తానికి విభజించ బడినా మా సంస్కృతినీ, మా భాషనూ, మా సాహిత్యాన్నీ 'విభజించ'డం సాధ్యం కాదు. రాజకీయమైన విభజన కన్నా సాంస్కృతిక విభజన మరింత ప్రమాదకరమైనదని మాకు తెలుసు. అది భారత ప్రజానీకపు మహోన్నత మైన ఉమ్మడి సంస్కృతి, జీవన విధానంపై చావుదెబ్బ కొడుతుంది."

ఆ ముసాయిదాలో ఈ క్రింది విషయం కూడా ప్రస్తావించ బడింది. 1947 డిసెంబరులో, హిందీ సాహిత్య సమ్మేళన్ వారి వార్షిక సమావేశానికి రాహుల్జీ అధ్యక్షత వహించి ఆ వేదికను ఆయన స్పష్టంగా మత తత్వ ప్రచారానికి (Communalist-preaching) వాడుకున్నారు. ఆయనలోని మత తత్వ ఉన్మాదం కాలం గడచిన కొద్దీ తగ్గక పోగా, వాస్తవానికి అతని గ్రంథం 'ఆజ్ కీ రాజనీతి' 1950లో ప్రచురించే నాటికి పరాకాష్ట దశకు చేరింది. ఆ పుస్తకంలోని ఒక పాత్ర చేత ఆయన యుద్ధం ప్రకటించడం ద్వారా పాకిస్తాన్‌కు గుణపాఠం చెప్పాలని అనిపించారు.

వ్యక్తిగతంగా, భారతదేశంలో ఎన్నడూ లేనంతగా హానికరమైన మత తత్వ ప్రచారాన్ని ఆయన చేసారు. ఇదంతా భాషా సమస్య పేరుతో జరిగింది.

ఆయన ఇలా అంటారు: "ఉర్దూ భాష గొప్ప ఏమిటి? అది అరబ్ జీహాదీల భారతీయ విజయ స్థంభం కాదా? ఆ భాష నంతా జాతీయ పదజాలంతో నింపకుండ, అరబిక్ పదాలతో నింపడం దుర్రాష్ట్రీయతా బీజాలు నాటడం కాదా? భారతదేశంలో ఇలా చేయడం వారికి కొత్తేమీ కాదు. ఇస్లాం మతం ఏం చెప్పినప్పటికీ, ముసల్మానులు దేశ జీవన స్రవంతిలో భాగస్తులు కావడానికి తిరస్కరిస్తున్నారు........ఇస్లాంను జాతీయం చేయడం లాభదాయకం. మౌలానా అజాద్ దృక్పథం కనుక భారతీయ ముస్లిములలో కొనసాగితే, వారి సానుభూతి, విధేయత భారత్‌తో పోకుస్తే సదా పాకిస్తాన్ పక్షే వుంటుంది.... ఈ భావం చివరికి భారతీయ ముస్లిములను రహస్య పంచమాంగ దళంగా మారుస్తుంది....."

రాహుల్జీ పుస్తకం నుంచి పై భాగాన్ని ఉల్లేఖించి, ఆ ముసాయిదా ఇలా వ్యాఖ్యానించింది. అటువంటి ప్రచారం హిందీ రచయితలను ఎందరినో తప్పు దారి పట్టించడంలో విజయవంతమైందనీ, కాంగ్రెసు ప్రభుత్వం అటువంటి ప్రచారకుల సహాయంతో, ప్రత్యేకంగా ఉత్తర ప్రదేశ్‌లో జాతీయ సంస్కృతిని పరిరక్షించడమనే విధానం క్రింద ఉర్దూను అణచివేయడం ప్రారంభించింది.

ఈ ముసాయిదాను ఆనాడు ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీ సి.పి.ఐ. ప్రచురిస్తున్న సాహిత్య పత్రిక 'ఇండియన్ లిటరేచర్'లో ప్రచురించారు. దీనిపై కొనసాగిన చర్చలో రాహుల్జీతో కలుపుకొని, ఆరుగురు ప్రసిద్ధ సాహితీ వేత్తలు- తమ తమ దృక్పథాలను తెలియచేస్తూ పాల్గొన్నారు.

హిందీ, ఉర్దూ భాషల జాతీయ సంప్రదాయలకూ, ఆయా భాషల విశిష్టతలకూ అనుగుణంగా ఒకే లిపి (దేవనాగరి) ఆధారంగా ఒక సాహిత్య భాషను అభివృద్ధి చేయవలసిన అవసరాన్ని గుర్తింప చేస్తూ, హిందుస్తానీ దేశప్రజల ఐక్యతా సమస్య, వారి సాహిత్య భాష ఐక్యతపై సన్నిహితంగా ముడి వడి వుందని ఆ ముసాయిదా

పేర్కొంది. ఈ సందర్భంగా ఆ ముసాయిదా 1943లో రాహుల్జీ రాసిన వ్యాసాన్ని విమర్శించింది. ఆ వ్యాసంలో ఆయన కౌరవి అధికార భాషగా, మీరట్ రాజధానిగా కురు జనపదమూ; పాంచాలీ అధికార భాషగా, బైరేలీ రాజధానిగా బుందేల్ఖండూ; హర్యానీ అధికార భాషగా, ఢిల్లీ రాజధానిగా, హర్యానా; కౌసాలీ, వాత్సి అధికార భాషలుగా, లక్నో, అలహాబాదులు రాజధానులుగా, ఉత్తర కోసలా, దక్షిణ కోసలా ఏర్పడాలని అన్నారు. అదే విధంగా బెనారస్ రాజధానిగా కాశీ; ఛాప్రా రాజధానిగా మల్ల; ముజఫర్పూర్ రాజధానిగా భట్జి; దర్భంగా రాజధానిగా విదేహ; భగల్పూర్ రాజధానిగా అంగ; పాట్నా రాజధానిగా మగధ జనపథాలు ఏర్పడాలన్నారు. రాహుల్జీ క్రీ.పూ. 600 నాటి జనపథాలకూ, 1943 నాటి హిందుస్తాన్కు ఏ మాత్రం తేడా గమనించలేదని ఆ ముసాయిదా వ్యాఖ్యానించింది.

దీనిపై మొదటి జవాబు ప్రసిద్ధ సమకాలీన మార్క్సిస్టు చరిత్రకారుడు సతీశ్ చంద్ర నుంచి వచ్చింది. ముందే ఏర్పరచుకున్న చట్రానికి అనుగుణంగా ఇరికించిన భావాలతో ఈ ముసాయిదా నిండి వుందని ఆయన విమర్శించారు. పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి కావడంతో, మన దేశంలో జాతులు ఇంకా రూపుదిద్దుకునే క్రమంలో వున్నాయని వాదించారు. హిందుస్తానీ జాతీయ చైతన్యం పెల్లుబకాల్సి వుంది. ఈ సమస్యను మార్క్సిస్టు దృక్పథంతో పరిశీలిస్తూ, బండ పోలికలు (Crude Paralism), అతి సరళీకరణ (Oversimplification) అనే రెండు ప్రమాదాల నుండి జాగ్రత్త పడమని హెచ్చరించారు. ఉత్తర భారతదేశంలో కేంద్రీకృత ప్రభుత్వం అభివృద్ధి కావడంవల్ల వచ్చే చారిత్రక సంక్లిష్టతలను నిష్పక్షపాతంగా అధ్యయనం చేయాల్సిందిగా సంబంధిత పార్టీ లన్నింటికీ సలహా ఇచ్చారు. అంతేగాక ఆ విధంగా ఏర్పడిన కేంద్రీకృత ప్రభుత్వం ఈ ప్రాంతంలో భిన్నమైన జాతీయ చైతన్యాన్ని పెరగనీయకుండా అడ్డుకోవడంలో నిర్వహించిన పాత్రనూ, భక్తి ఉద్యమం యొక్క సరైన ప్రాధాన్యతనూ- ఒక్క మహారాష్ట్రలో తప్ప మిగిలిన చోట్ల దీనిని ఫ్యూడల్ వేర్పాటు వాద శక్తులు ఎలా మత తత్వ, దురహంకార ధోరణులను రెచ్చగొట్టడానికి వాడుకున్నాయో అధ్యయనం చేయమని సలహా ఇచ్చారు.

ఆ తర్వాత వచ్చిన జవాబు ప్రొఫెసర్ పి. సి. గుప్తాది. ముసాయిదాలో చెప్పినట్లు హిందీ, ఉర్దూ వేర్వేరు భాషలు కాదనీ, ఒకే భాష యొక్క రెండు సాహితీ రూపాలనీ. ఒకే పద సముదాయం కల్గి, ఒకే వ్యాకరణ సూత్రాలు కలిగిన భాషలనీ ఆయన అంగీకరించారు. అయితే, హిందుస్తానీ అనే దేశాన్ని రూపొందించే సంక్లిష్ట క్రమం గురించి మరింత లోతుగా పరిశోధించాలని అన్నారు. భారత దేశంలో జాతుల రంగంలో చారిత్రక శక్తులు ఇంకా చురుగ్గానే వున్నాయనీ, ఎవ

రెవరిది ఏ ప్రాంతం అని విడగొట్టడం సాధ్యం కాదనీ అభిప్రాయపడ్డారు. ఆయన ఊహ ప్రకారం. ఒకే భాషగానీ, ఆ భాషతో సామ్యంవున్న భాషగానీ మాట్లాడేవారితో ఒకటికన్నా ఎక్కువ దేశాలు ఏర్పడవచ్చు. రాహుల్జీపై విమర్శకు సంబంధించినంత వరకు ముసాయిదాతో అసంతృప్తి వెల్లడించారు రాహుల్జీ బొంబాయిలో జరిగిన హిందీ సాహిత్య సమ్మేళనంలో ఇచ్చిన ఉపన్యాసం నిస్సందేహంగా గర్హనీయమైనదే - అయినప్పటికీ, ఆ తర్వాత భాషా సమస్యపై రాహుల్జీ అభిప్రాయాలు మారాయి. మెరుగైనాయి అన్న విషయాన్ని ఆయన సూచించారు. రెండు భాషల్లోనూ వున్న ఉత్తమ రచనలను - ఆయా లిపులలో ప్రచురించాలనీ, హిందుస్తానీ ప్రజల జీవన విధానాలనుండి 'భూస్వామ్య స్వభావం'ను తొలగించడం ద్వారా, రెండు భాషలనూ ఐక్యపరచే క్రమం మరింత బలపడుతుందని ఆయన ఆశించారు.

ప్రత్యేకంగా భాషా వివాద సందర్భంగా వచ్చిన మరో ముగ్గురు అమృత రాయ్, లలిత మోహన్ అవస్తి, డా. మహమ్మద్ హసన్ జవాబులు విమర్శనాత్మక పరిశీలన జరప దగ్గవిగా వున్నాయి. హిందీని జాతీయ భాషగా చేయాలనే ఉద్యమాన్ని నిర్వహించే తీరు తప్పనిసరిగా హిందీయేతర ప్రజల హృదయాలను గాయపరచి, వారిలోగల దేశభక్తి యుత అంశాలను వేరు పరుస్తుంది. ఎందుకంటే హిందీ భాషకు అనుకూలంగా జరుగుతున్న ప్రచార పద్ధతులు అప్రజాస్వామికంగా వున్నాయి - హిందీయేతర ప్రాంత ప్రజల భావోద్వేగాలను సరిగా పరిగణనలోకే తీసుకోవడంలేదు. ఈ ధోరణిని ఎటువంటి తడబాటు లేకుండా నిరసించాలని రాయ్ అన్నారు. భారత ప్రజల్లోని వివిధ జాతుల వారిలో ఐక్యంగా వుండాలన్న కాంక్ష విస్తృతంగా వుందన్న వాస్తవం కీలకమైనదనీ, సరైన నిర్ణయాలకు రావాలంటే ఈ విషయాలను పరిగణనలోకి తీసుకోవాలనీ రాయ్ అభిప్రాయపడ్డారు.

ఈ ముసాయిదా అన్యాయంగా రాహుల్జీని నిందించిందనీ, రాహుల్జీని మత తత్వ ప్రతీఘాతుకులతో కలపడం వల్ల ఎటువంటి ప్రయోజనం వుండదని ఆయన భావించారు. శాంతి, స్వేచ్ఛ, ప్రజాస్వామ్యం కోసం ఐక్య సంఘటన నిర్మించే దృష్టికోణం నుండే ఇతర సమస్యల్లాగానే, జాతీయ భాషా సమస్యను పరిశీలించాలని ఆయన అభిప్రాయం. ప్రధానమైన విషయం ఏమిటంటే, హిందీ, ఉర్దూ మాట్లాడే ప్రజల్లో ఐక్యతనూ, ఒకే భాషా కుటుంబానికి చెందివున్నవన్న వాస్తవాన్నీ, కొంతకాలం వరకూ ఒకే సంప్రదాయం కలిగి వుండడాన్నీ, అవి విడిపోడానికి గల చారిత్రక కారణాన్నీ, ఒకే పునాదిపై రెండు ఉపరితల నిర్మాణాలు అభివృద్ధి కావడాన్నీ, ప్రజాస్వామ్యబద్ధంగా ఐక్యమైతే వాటికి గల మహోజ్జ్వలమైన భవిష్యత్తు గురించీ, వివరణాత్మకమైన ప్రచారాన్ని చేయడం అవసరం.

భాషలూ, వాటి ప్రాంతాలూ, రాష్ట్రానికి చెందిన భాషలూ, కేంద్ర ప్రభుత్వం వారి భాష - భారత రాజ్యాంగంలో పేర్కొన్నవి - వీటికి సంబంధించిన నియమాలూ, నిర్ణయాలూ, వివరణలూ - ఇవన్నీ ఆచరణలో బూర్జువా విధానపు వ్యక్తీకరణలేనని, అవి ప్రజావ్యతిరేకమైనవనీ ఆవస్తి అభిప్రాయం. ఈ పరిస్థితిలో దేశంలోని ప్రతిక్రియా స్వామ్య, ప్రగతిశీల శక్తులు, భాషా రంగంలో మూడు ప్రధానమైన చిక్కులను ఈనాటి పాలకులు సృష్టించారన్న విషయం అర్థం చేసుకోవాలని ఆయన వాదించారు. అవేమిటంటే - ఇంగ్లీషు భాషకు అనవసరమైన ప్రాముఖ్యత నీయడం; ఉర్దూను అణచివేయడం, సంస్కృత భాషకు అవసరానికి మించిన రక్షణ కల్పించడం.

హిందీ నిస్సందేహంగా అత్యంత విశాలమైన భూభాగంలో మెజారిటీ ప్రజల చేత మాట్లాడబడుతోందని ఆయన అనుకున్నారు. ఆధునిక హిందీ భాష, ఖడీ బోలీ మాండలికం నుంచి అభివృద్ధి చెందిన భాష మాత్రమే - అయినా ఇంకా అనుకున్నంత అభివృద్ధినీ,ఉన్నతినీఅది అందుకోలేదు. హిందీభాష ఇంకా న్యాయశాస్త్రం, విజ్ఞానశాస్త్రం, తత్వశాస్త్రం - ప్రజా సాహిత్యంలలోకి ప్రవేశించాల్సివుంది. హిందీ భాషాభిమానులు ఈ విషయాన్ని గుర్తించాలి. ఏ భాషగానీ. చట్టబద్ధమైన శాసనాల ద్వారా, ఆజ్ఞలద్వారా ఉన్నతస్థాయిని సంపాదించలేదనీ, ఒకవైపు హిందీని ప్రజా భాషగా రూపొందించంలో అన్నిరకాల ప్రయత్నాలూ చేయాలనీ, మరోవైపు దానిని విజ్ఞానశాస్త్ర తత్వశాస్త్ర, న్యాయశాస్త్ర విద్యాభాషగా అభివృద్ధి చేయడంలో సకల ప్రయత్నాలు చేయాలనిఆయన గట్టిగా అభిప్రాయపడ్డారు.

ఏ రకమైన 'విదేశీ' ప్రభావం పడకముందే, చాలాకాలం క్రిందటే భారతీయ సంస్కృతి, జాతీయ చైతన్యం ఉద్భవించాయన్న వాదనను హసన్ తిరస్కరించారు. భారత సామాజిక చరిత్ర పరిశీలించి ఈ దేశంలో జాతీయ చైతన్యమూ, భారతీయ సంస్కృతి, జాతీయ గుర్తింపు అనేవి ఇటీవల ఉద్భవించాయన్న నిర్ణయానికి వచ్చారు. కనుకనే మొగలాయిల పతనం వరకూ భాష విషయంలో ఇటువంటి పరిస్థితి ఏర్పడింది. సాంస్కృతిక ఐక్యత, జాతీయ చైతన్యం ఫలితంగా వివిధ ప్రాంతాల్లో సంధానంగా ఒక నూతన, భాష రూపొందుతూ వుంది. దానిలో ఆర్యన్ సెమిటిక్-రెండు ప్రభావాలూ వున్నాయి. వివిధప్రాంతాల్లో విభిన్నమైన మాండలీకాలూ, భాషలూ మాట్లాడుతూనే వున్నా ఒక నూతన భాష జనించింది. ఖడీబోలీ ఈ విధంగా ఆవిర్భవించినదే - ఈ సంప్రదాయ ప్రాముఖ్యత చాల కీలకమైనదని హసన్ కిక్కి చెప్పాడు. ఆ తర్వాత ఆయన మత తత్వ విద్వేషం,అసూయ, పక్షపాతం అనే వాటి ద్వారా భారత ప్రజానీకాన్ని విభజించడంలో బ్రిటీషువారి కుతంత్రాన్ని వర్ణించారు.

ఆయన చరిత్రకు గల వాస్తవికత, చిరుకుదనం పట్ల ప్రగాఢమైన విశ్వాసాన్ని ప్రకటించారు. ఇండియాలో జాతీయ భాషకు గల ఐక్యతాశక్తిని, బ్రిటీషు సామ్రాజ్యవాదం తన జిత్తులమారి కుట్రలతో భగ్నం చేసింది. ఈ కారణం వల్ల భాషా విషయకంగానూ, సాంస్కృతికంగానూ, జాతీయ పరిణామ క్రమంలో జరగాల్సిన కలయిక భగ్నం చేయబడింది. అంతిమంగా రెండు విభిన్న భాషలను రూపొందించింది బడా బూర్జువా వర్గపు ఆదేశాల కనుగుణంగా, నిర్బంధ జాతీయ ఐక్యతను రూపొందించడంలో కాంగ్రెసు ప్రభుత్వ పాత్ర గురించి చర్చిస్తూ, హసన్ ఈ ముసాయిదా నివేదికలో మరింత ధైర్యంగా, సాంస్కృతిక ఐక్యతనూ, జాతీయ సంస్కృతినీ సుస్థిరపరచుకోడానికి మార్గం దాని వైవిధ్యపూరితమైన అభివృద్ధిని పట్టించుకోకపోవడం ద్వారా కాదనీ, అన్ని రకాల భాషలూ, సాహిత్యాలూ, వాటివాటి విశిష్టతల కనుగుణంగా స్వేచ్ఛగా వికసించనీయడమే సరైన మార్గమనీ అన్నారు.

భిన్నత్వంలో ఏకత్వాన్ని సంపద్వంతం చేయడంలో గల వ్యూహాత్మక ప్రాముఖ్యతే, ఈ వాదనలో గల సారాంశం - దీన్ని ఏ మాత్రం జ్ఞానం వున్న సిద్ధాంతవేత్త అర్ధం చేసుకోకుండా వుండటానికి వీలులేదు. రాహుల్జీ కూడా భారత దేశంలో భాషా సమస్యకు ఆచరణీయమైన పరిష్కారం కనుక్కోవడమనే సమస్య యొక్క ప్రాముఖ్యతను అర్ధం చేసుకున్నాడు. మన దేశం బహు భాషల, బహు జాతుల సమ్మేళనమని గుర్తించుకొని, ఒక ప్రత్యేక ప్రాంతంలో వున్న మెజారిటీ ప్రజల మాతృభాషే బోధనా మాధ్యమంగా వుండాలని - పరిపాలనా భాషగా వుండాలని అన్నారు. సరిగ్గా ఈ కారణం వల్లనే, ఇండియాకు ఒక సార్వత్రిక భాష అవసరమనీ, పరస్పర సంబంధాల కొరకు విదేశీ సంబంధాల కొరకు, అంతర్రాష్ట్రీ సంబంధాలకు, కేంద్రానికీ, రాష్ట్రానికీ మధ్య కమ్యూనికేషన్ కోసం ఒక ఫెడరల్ భాష కావాలి. అటువంటి భాషను ఇండియా రూపొందించుకో లేకపోతే, ఈ దేశం ఇంగ్లీషును తొలగించుకోలేదనీ, ప్రజలను సామాజికంగా విభజించడాన్ని ఆపడం సాధ్యం కాదనీ దృఢంగా ఆయన నమ్మారు.

అదే సమయంలో, ఇతర ప్రాంతీయ భాషలనుండి అసంఖ్యాకమైన పద సముదాయాన్ని తనలో ఇముడ్చుకున్న భాష, దేశంలో అత్యధిక మెజారిటీ ప్రజలకు పరిచయమైన భాష మాత్రమే ఫెడరల్ లేక కేంద్ర భాషగా వుండగల్గుతుందని ఆయన విశ్వసించారు. అటువంటి భాష హిందీ ఒక్కటేనని రాహుల్జీ నిశ్చితాభిప్రాయం. సగం దేశం హిందీని బోధనామాధ్యమంగా అంగీకరించింది. అది ఎన్నో వందల ఏళ్ళనుంచి తనకు కావాల్సిన పదాలను సంస్కృతం నుంచి తెచ్చుకుని స్వంతం చేసుకుంది కనుక ఇతర ప్రాంతాలవారికికూడా తేలిగ్గా అర్ధమౌతుంది. ఈ విషయంలో ఉర్దూ, సరిగ్గా హిందీకి ఇతర ప్రాంతీయ భాషలకూ వ్యతిరేక

స్వభావం కలిగివుంది. ఎందుకంటే అది తన పెద సముదాయాన్ని అరబిక్ భాష నుండి సంపద్వంతం చేసుకుంటోంది. కనుక, ఉర్దూను ఫెడరల్ భాషగా కానీ, కేంద్ర భాషగా గానీ అంగీకరిస్తే, ఇతర ప్రాంతీయ భాషలకు ఎన్నో ఇబ్బందులను కలుగచేస్తుందని రాహుల్జీ అభిప్రాయపడ్డారు. అయితే వివిధ ప్రాంతీయ భాషల ప్రతినిధుల అంగీకారంతో హిందీ కానీ, ఏ ఇతర భాషను కానీ, ఫెడరల్ లేక కేంద్ర భాషగా గుర్తించడాన్ని రాహుల్జీ సమర్థించాడు.

ఈ పై చర్చ అంతా మొత్తంమీద దేన్ని స్పష్టం చేస్తోందంటే, రాహుల్జీ కానీ, ఆయన విమర్శకులు కానీ కేంద్రీకృత భారత యూనియన్‌ను అంగీకరిస్తున్నారు. అదే విధంగా తక్షణ రాజ్య నిర్వహణలో రాజ్యాంగపు కేంద్రీకృత స్వభావం, ఒక అంతర్భాగ మని అంగీకరిస్తున్నారు. సాంస్కృతిక విషయంగా కూడా, ఒక బలమైన కేంద్రం వుండటాన్ని కమ్యూనిస్టులూ, ఇతర వామపక్షవాదులు ప్రధానమైన అంశంగా గుర్తించారు. ఈనాడు వెనక్కి తిరిగి చూస్తే, ఎవరు కూడా నిజమైన ఫెడరల్ నిర్మాణం గురించి చర్చించాలనుకోలేదన్నది స్పష్టమౌతుంది. అటువంటి ఫెడరల్ నిర్మాణంలో పై విభ్యాలు ఏనాటికీ పరిష్కారం కావని వారు వూహించారు.

ఈ సందర్భంగా, 1950 దశాబ్దపు తొలిభాగంలో మార్క్సిస్టు కార్యాచరణలో ప్రముఖుడైన గోపాల్ హాల్దార్ తీసుకున్న పై ఖరినిపరిశీలించడం ఉపయోగకరంగా వుంటుందని భావిస్తున్నాను. ఆయన 'బంగ్లార్ భాషా సమస్యా' (బెంగాలీ భాషా సమస్య) అనే వ్యాసాన్ని 'పరిచయ్' 1953 సెప్టెంబర్ సంచికలో రాశారు. అది కొత్త ఆలోచనల నెన్నిటినో రేకెత్తిచ్చింది. సి. పి. ఐ. బెంగాల్ కమిటీ వారి సాహిత్య పత్రిక ఐన 'పరిచయ్'లో వచ్చిన ఆ వ్యాసంలో హిందీని అధికార భాషగా చేయడంవల్ల వచ్చే లాభనష్టాలను వివరంగా చర్చించాడు.

ఆయన 'హింది' అనే పదం చుట్టూ అల్లుకొనివున్న వివిధ రకాల భాషా శాస్త్ర సంబంధమైన గుణ నిర్దేశాల గురించి విమర్శనాత్మకమైన పరిశీలనను-మొత్తం ఉత్తర భారత ప్రాంతంలో స్పష్టంగా కనబడే విభిన్న సామాజిక, ఆర్థిక నిర్మాణం ఆధారంగా చేసారు. ఆ క్రమంలో ఆయన ఒక మిశ్రమ రూపంలోవున్న 'బజారియా హింది' అనే దాన్ని గుర్తించారు. 'బజారియా హిందీ'అంటే తీర్థయాత్ర స్థలాల్లోనూ, రైల్వేస్టేషన్లలోనూ, మార్కెట్ స్థలాల్లోనూ ఉత్తర భారతంలో సాధారణ ప్రజానీకం మాట్లాడే మాండలికమన్నమాట. ఆ భాషకు 'బజారియా హిందీ' అనే పేరు హాల్దార్ పెట్టారు. ఈ బజారియా హిందీకి హిందీ, ఉర్దూభాషల వ్యాకరణ నిర్మాణానికి ఏ మాత్రం సంబంధం లేదనీ, దీనిని హిందుస్థానీ ప్రజలు తమ శ్లిష్ట సాహిత్యంలో ఏనాడూ వాడలేదనీ, ఉన్నతవర్గాలవారు ఈ భాషలో మాట్లాడరనీ ఆయన తెలియ

చేసారు. మెజారిటీ ప్రజల భాష గనుక హిందిని అధికార భాషగా చేయాలనుకుంటే, ఈ స్థానాన్ని 'బజారియా హిందీ'కి కల్పించాలి - ఎందుకంటే ఇది శ్రామికుల రోజువారీ ప్రయోగాల్లో ఏనాటికానాడు సంపద్వంతం అవుతూ అభివృద్ధి అవుతుంది. ప్రజలు తమ రోజువారీ అనుభవాల ద్వారా, ప్రత్యేక వాస్తవికతలను ఎదుర్కోవడం ద్వారా ఒక భాషను రూపొందించుకునే క్రమానికి సుదీర్ఘ కాలం పట్టి వుండవచ్చు. ఈ భాషా వివాదం మొత్తంలో, దక్షిణ భారత ప్రజల సమస్యలకు ఇవ్వాల్సినంత ప్రాధాన్యతను ఏనాడూ ఇవ్వలేదన్న విషయం కామ్రేడ్ హాల్దార్‌కు తెలుసు అన్నది స్పష్టం అదే సమయంలో దక్షిణ భారతంలోని కొన్ని పట్టణ ప్రాంతపు శ్రామిక వర్గంలో కొందరు ఈ 'బజారియా హిందీ'ని తమ రోజువారీ సాధారణ జీవనంలో అంగీకరించరన్న విషయం ఆయనకు తెలుసు. విభిన్న సామాజిక మూలాలు కలిగి వున్న ఈ ప్రజలందరికీ, రోమన్ లిపిని గనుక వాడితే, చాల ప్రయోజనకరంగా వుంటుందని హాల్దార్ అభిప్రాయపడ్డారు. భాషా సమస్యపై సునిశితంగా పరిశీలించిన హాల్దార్ బలవంతంగా ఒక భాషను ప్రత్యక్షంగాగానీ, పరోక్షంగా గానీ రుద్దడం అన్న విషయాన్ని వ్యతిరేకించారు. దురదృష్టవశాత్తు, బహుభాషావేత్త, జాతీయ సమస్యపై మార్క్సిస్టుగా ఖరి అవలంబించిన, రాహుల్జీ తాను యౌవనంలో ఏర్పరచుకున్న భావాలకంటే ఉన్నతంగా ఎదగలేకపోయారు.

కామ్రేడ్ హాల్దార్ యొక్క వెసులుబాటుతో కూడిన దృక్పథం ఈ నాటికీ మరింత ఉచితంగాకనబడుతోంది. సాంస్కృతికసిద్ధాంతీకరణపైన ప్రభుత్వంనిర్దేశించిన, ప్రభుత్వంపై ఆధారపడిన సాధారణ సాంకేతిక విషయాల పరిధిదాటి, స్వతంత్రంగా ఆలోచించడం హాల్దర్ ప్రధానలక్ష్యం. ఈనాటి పరిస్థితులలో ఇటువంటి దృక్పథం వల్ల మనం ఎంతో లాభం పొందవచ్చు. ఈనాటి రాజ్యాంగ నిర్వహణకు, ఫెడరలిజమ్యూ, వికేంద్రీకరణ అనేవి రెండూ కీలకమైన భావనలు. సహజసిద్ధమైన వైవిధ్యాలకు మెరుగులు దిద్దకుండా వాటికి ప్రతిభావంతమైన శిక్షణ ఇవ్వడం మనం నేర్చుకోవాలి. మన ప్రత్యేక భౌగోళిక-రాజకీయ రూపాలు సహజ పరిణామం కొన్ని స్వతంత్ర ప్రాంతాల సృష్టిని సమర్థించవచ్చు. ఈ ప్రాంతాల్లో రాజకీయ అధికార వికేంద్రీకరణ నిజంగా అవసరం కావచ్చు. ఈ క్రమం ఫలవంతమైన దశకు చేరడానికి అనుమతించడంద్వారా, ఐక్యతను ఇంకా బాగా సాధించవచ్చునని నా మనవి. ఆ దశకు చేరితే తామే రూపొందించుకున్న పరస్పర అదుపు, వెసులుబాటుద్వారా చట్టబద్ధమైన, సాంస్కృతికపరమైన నియమ నిబంధనలను తమపై రుద్దటాన్ని పట్టించుకోవు.

డా మహాదేవ సాహా సలహాపై నేను, ఫాసిజంపై రాహుల్జీ రాసిన చిన్న కరపత్రాన్ని బెంగాలీభాషలోకి మొట్టమొదటిసారిగా అనువదించాను. అంతేగాదు, 1942 జులైలో బెంగాల్‌లో సి.పి.ఐ.ని చట్టబద్ధ పార్టీగా గుర్తించినపుడు ఏర్పాటు

చేసిన సభలో పాల్గొనడానికి రాహుల్జీ కలకత్తాకు వచ్చినపుడు మా కమ్యూన్‌లో ఆయనకు ఆతిథ్యం ఇచ్చే గౌరవం మాకు కల్గిందని చెప్పడానికి ఆనందిస్తున్నాను. మా దేవ సాహి సమక్షంలో నేను భాషా సమస్యపై ఆయన ఇంట్లో కె.కే.ప్రొఫెసర్ సునీతిబాబు గారి చటర్జీతో నేను చర్చించాను. సునీత్‌బాబు మాకొక ఆసక్తిదాయకమైన కబురందించారు. ఇటువంటి చర్చే ఆయన మోహనకుమార్ మంగళంతో చేసానని తెలియ చేసారు. సి.పి.ఐ ఎందుకు భాషా సమస్యపై జరుగుతున్న ఆసక్తిదాయకమైన చర్చను మధ్యలో ఆపి వేయాలని నిర్ణయించిందని ఆయన కుమార మంగళంను అడిగారు. "ఆ చర్చను మరి కొంత కాలం పొడిగిస్తే, పార్టీలో చీలికను మేము నివారించగలిగేవాళ్ళం కాదు" అని కుమార్ మంగళం వెంటనే జవాబు ఇచ్చారు.

ఈ చర్చను అర్థాంతరంగా ఆపి వేసినా, ఆ తర్వాత కొద్ది సంవత్సరాలకే చీలిక అనేది వాస్తవ రూపం దాల్చింది. దీనికి మనమేం చేయలేం. భాషా సమస్య ఈనాటికీ మనల్ని వెంటాడుతోంది. కమ్యూనిస్టులు హిందీ భాషా ప్రాంతపు లోతట్టు ప్రాంతాల్లో తమ ప్రభావాన్ని పెంచుకోలేకపోవడాన్ని దృష్టిలో వుంచుకుంటే, ఈ భాషా సమస్య అనేది ప్రత్యేక ప్రాధాన్యతను సంతరించుకొంది. వాస్తవాలను ఎంత సక్రమంగా ఎదుర్కోవాలో అలా ఎదుర్కోవాల్సిన సమయం ఇదీ.

ఆంగ్లం నుంచి అనువాదం : రవిబాబు

## ప్రజాసాహితి డిసెంబరు 1993
## మావో శత జయంతి సంచిక

ఈ సంవత్సరం డిసెంబర్ 26న జన చైనా నిర్మాత, మార్క్సిస్టు సిద్ధాంత వేత్త, పీడిత ప్రజల నాయకుడు ఐన మావో సేటుంగ్ శతజయంతి సంవత్సరం ప్రారంభమౌతుంది. ఈ సందర్భంగా ప్రజాసాహితి వచ్చే సంచిక (డిశంబరు 93)ను మావో శతజయంతి ప్రత్యేక సంచికగా రూపుదిద్దుతున్నాం.

ప్రజాసాహిత్యం, ప్రజాకళలు, ప్రజా సంస్కృతికి సంబంధించిన వ్యాసాలూ, కవితలూ, కథలూ, నాటికలూ మొదలగు రచనలతో వెలువడే ఈ సంచికకు మీమీ రచనలను పంపించి సహకరించవలసిందిగా రచయితలనూ, కళాకారులనూ ప్రజా సాహితి కోరుతోంది.

— సంపాదక వర్గం

# టోనీ మారిసన్ మధుర గానం

— వి. ఉదయరేఖ

1993 వ సంవత్సరానికి నోబెల్ సాహిత్యపురస్కార బహుమతి అమెరికాకు చెందిన నల్లజాతి రచయిత్రి టోనీ మారిసన్‌కు లభించింది. 62 సంవత్సరాల టోనీ మారిసన్ ఇప్పటివరకు ఆరు నవలలు, ఒక కథ, ఒక నాటకం, [illegible] వ్యాసాలు రాసారు.

నోబెల్ బహుమతి అందుకున్న ఎనిమిదవ మహిళ ఈమె. నోబెల్ సాహిత్య బహుమానాన్ని అందుకున్న వారిలో 90 వ వ్యక్తి. ఈ ఏడాది [illegible] కం 8,25,000 డాలర్లు అంటే 2 కోట్ల 47½ లక్షల రూపాయలు. నోబెల్ సాహిత్య బహుమానాన్ని మొట్ట మొదటిగా గెల్చుకున్న ఫ్రాన్స్ ఇప్పటికి పదకొండుసార్లు గెల్చుకుని మొదటి స్థానంలో వుంది. అమెరికా తొమ్మిదిసార్లు గెల్చుకుని రెండవ స్థానంలో వుండగా ఆరు శతాబ్దాల సాహిత్య చరిత్ర కల్గిన ఇంగ్లండు ఏడు సార్లు గెల్చుకుని మూడవ స్థానంలో వుంది.

1931 ఫిబ్రవరి 18న అతి పెద్ద కుటుంబంలో పుట్టిన టోనీ అసలు పేరు క్లో అంథోని వాఫోర్డ్. హెరాల్డ్ మారిసన్‌ను వివాహం చేసుకుని టోనీ మారిసన్‌గా మారారు. వాషింగ్టన్ డి. సి. లోని హోవర్డ్ విశ్వవిద్యాలయం నుంచి 1953లో గ్రాడ్యుయేట్ పట్టాను, కోర్నెల్ విశ్వవిద్యాలయం నుంచి 1955 లో మాస్టర్స్ డిగ్రీ సంపాదించారు. ప్రస్తుతం న్యూజెర్సీలోని ప్రిన్సిటన్ విశ్వవిద్యాలయంలో మానవీయ శాస్త్రాల ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నారు. ప్రిన్సిటన్ విశ్వవిద్యాలయంలో పని చేస్తూ నోబెల్ బహుమతి పొందిన వారిలో మారిసన్ 23 వ వ్యక్తి.

అమెరికాలోని నల్లజాతివారి సజీవ చరిత్ర టోనీ మారిసన్ నవలలద్వారా రచనల ద్వారా స్పష్టంగా కళ్ళకు కడుతుంది. గాన గుణం కల్గిన వచనాన్ని ఆమె సాధించారు. వచనరూపంలో వున్న కవితను ఆమె రచనల్లో చూస్తాం. ఆమె రచనల్లో ఒక నిశ్శబ్ద తుఫాను కనబడుతుంది. ఆమె సజీవ గతచరిత్ర గురించి గానం చేస్తోంది. ఆమె ఆత్మకతలో ఫాక్‌నర్ ధోరణీ, ప్రతీకలు వాడటంలో గార్సియా మార్క్వెజ్ శైలీ, గతాన్నీ, వర్తమానాన్నీ కలగలపడంలో హెర్బ్స్టు పద్ధతీ ఆమె రచనల్లో చూస్తాం.

1776 లో అమెరికా తన రాజ్యాంగంలో "దేవుని ముందు మానవులందరూ సమానమే" అని రాసుకున్నా, ఆ తర్వాత నూరేళ్ళపాటు బానిసత్వం కొనసాగింది. 1861-65 అంతర్యుద్ధం బానిసత్వానికి చరమ గీతం పాడింది. అయినా చట్టబద్ధమైన సమానత్వం సాధించడానికి అమెరికాలో నల్లజాతి ప్రజలకు మరో వంద సంవత్సరాలు పట్టింది. సుప్రీం కోర్టు తీర్పుద్వారా విద్య, రవాణా, గృహవసతి సౌకర్యాలలో

సమానత్వాన్ని సాధించారు. కాలక్రమేణా నల్లజాతి అమెరికన్‌లు రాజకీయాల్లో, వ్యాపారంలో, కళలలో ప్రధానమైన స్థానాలను ఆక్రమించగల్గినా, ఇటీవల జరిగిన రోడ్నీకింగ్ సంఘటనద్వారా, నల్లజాతి ప్రజల సమస్యలు ఇంకా పరిష్కరింపబడ లేదని రుజువౌతోంది. అభివృద్ధి చెందిన, అత్యంత 'సంపన్న' దేశమైన అమెరికాలో హార్లెమ్ స్క్వేర్‌లో ఇప్పటికీ జీవిస్తున్న నీగ్రోల జీవన ప్రమాణం బంగ్లాదేశ్ ప్రజల జీవన ప్రమాణం కంటే తక్కువ. ఇది అమెరికాలో నేడు నల్లజాతి ప్రజల (నీగ్రోజాతి) సామాజిక, ఆర్థిక దుస్థితిని తెలియ జేస్తోంది. ఈ పరిస్థితిలో నుంచి పెల్లుబికింది నల్లజాతి చైతన్య ఉద్యమం.

మార్టిన్ లూథర్ కింగ్, మాల్కొమ్ X లేకుండా టోనీ మారిసన్‌ను వూహించలేము. పౌరహక్కుల ఉద్యమం, నల్లజాతి చైతన్య ఉద్యమం ఏమి సాధించినా సాధించకపోయినా తెల్లవారి అంతరాత్మపై కనీసం ఒక గాటు పెట్ట గల్గాయి. 20 వ శతాబ్దంలో నల్లజాతి అమెరికన్‌ల చైతన్యాన్ని అమెరికాలోని ముగ్గురు రచయిత్రులు సాహిత్యంలో చిత్రిస్తున్నారు. వారు టోనీ మారిసన్, మాయా ఏంజిలో, ఆలిస్ వాకర్‌లు టోనీ రచనల్లో నల్లజాతివారి మనసుల్లో నేడు చెలరేగు తున్న జాతియుద్ధాలను చూడగలం. టోనీ తన రచనల గురించి ఇలా అంటున్నారు. "నేను ప్రపంచాన్ని, సమాజాన్ని పరిశీలిస్తున్నాను. రచిస్తున్నాను. అంటే అది నల్ల జాతి ప్రజల ప్రపంచమే - సమాజమే. అంటే దీని అర్థం నేను తెల్లవారి గురించి రాయనని కాదు. నేను ఎన్నుకునే కథా వస్తువుకు సరిగ్గా సరిపోయేవారు నల్లజాతి ప్రజలే. నల్లజాతి ప్రజలు ప్రపంచంలో ఎక్కడికి వెళ్ళినా తమ సంస్కృతిని అక్కడికి తీసుకువెళతారు. మైనీ (Maine) ప్రాంతంలో వున్న నల్లవారి గురించి రాస్తే, వారు ఒహియో (Ohio) లోని నల్లజాతి వారిలాగానే వుంటారు. వారి సంస్కృతి ఒక్కటిగానే వుంటుంది. మైనీలోని నీగ్రోల మంగలషాపు, ఒహియో లోని నీగ్రోల మంగలి షాపూ ఒకేరకంగా వుంటాయి. ఆ షాపులకు వచ్చేవారు కూడా దాదాపు ఒకే రకంగా వుంటారు.

"ప్రతి మైనారిటీ రచయిత నాలుగు దశలు దాటాలి" అని టోనీ అభిప్రాయం. ఈ నాలుగు దశలూ ఏమిటంటే - 1. ఆగ్రహం దశ, 2. ఆత్మదర్శనం దశ 3. సంస్కృతిని జాగ్రత్తగా వినియోగించుకునే దశ- 4. తెగల జాతుల అనుభవాల నుంచి ఒక తాత్విక భావనలోనికి చేరే దశ. ఈ అభివృద్ధిని టోనీ నవలల్లోని 'బిల వ్‌డ్' లో స్పష్టంగా చూడగలం.

చివరగా టోనీ రాసిన ఆరు నవలల్లోని కథా వస్తువును స్థూలంగా పరిశీలిద్దాం.

మొదటి నవల 1969 లో విడుదలైంది. దాని పేరు 'ది బ్లూయెస్ట్ ఐ' (నీలం రంగు కళ్ళు). ఈ నవలలో పెకోలా అనే 12 ఏళ్ళ నల్లజాతి బాలిక తన

తోటి తెల్లజాతి పిల్లలకుండే నీలికళ్ళు తనకూ కావాలని ప్రార్థించేది. తన తండ్రిచేత లైంగిక దాడికి గురై తల్లి అవుతుంది. ఈ పరిస్థితిని తట్టుకోలేక పిచ్చిదవుతుంది.

సూలా (1973) నవల మధ్య పశ్చిమ నల్లజాతి నేపధ్యంతో రాయబడింది. ఇద్దరు నల్లజాతి స్త్రీల మధ్య మిత్రత్వం కథా వస్తువు.

సాంగ్ ఆఫ్ సాల్మన్ (1977) నవల నల్ల అమెరికా గురించిన మహా గ్రంథం- ఎలెక్స్ హేలీ 'రూట్స్' లాగా. గత చరిత్రను చీకటి కోణాల్లోకి తీసుకు వెళ్తుంది.

తార్ బేబీ (1981) నవల అత్యంత తీవ్రమైన ఉద్రేకాల సముదాయం. జాతి, వర్గం, సంస్కృతి గురించిన విశిష్ట భావాల సంపుటి ఇది. ఉత్తర ఫ్లోరిడా పట్టణం నుండి పారిపోయి వచ్చిన నేరస్తురాలైన అందమైన నల్లజాతి స్త్రీ మనసులో, తన నల్లజాతి ప్రియునికీ, ధనిక, తెల్లజాతి ప్రపంచానికి ప్రాతినిధ్యం వహించే పారిస్ పట్టణానికీ మధ్యగల సంఘర్షణను చిత్రించడం జరిగింది.

'బిలవ్‌డ్' (1987) మారిసన్ నవలల్లో విశిష్టమైనదని విమర్శకుల అభిప్రాయం. ఈ నవల కథా వస్తువు టోనీకి యాదృచ్ఛికంగా లభించింది. రేండమ్ హౌస్ ప్రచురణకర్త కొరకు నల్లఅమెరికా వారి చరిత్ర గ్రంథస్థం చేయడానికి— ఒక వార్తాశకలం టోనీ చదవడం సంభవించింది. అదేమిటంటే - బానిసత్వం నుంచి పారిపోయిన బానిస స్త్రీ ఒకామె తన శిశువును మరల బానిస జీవితంలోనికి పోనీయకుండా అడ్డుకోడానికి, చంపేస్తుంది. ఈ సంఘటన ఆధారంగా వ్రాసిన నవల ఇది. దీనికి పులిట్జర్ సాహిత్య బహుమతి లభించింది.

జాజ్ (1992) టోనీ రాసిన ఆరవ నవల. ఇది జోట్రిస్ అనే ఆడవారి అలంకరణ సామగ్రి అమ్మే వ్యాపారి కథ. అతడు 18 ఏళ్ళ డోర్కాను పిచ్చిగా ప్రేమిస్తాడు. ఆ అమ్మాయిని చంపేస్తాడు. అయితే అతని భార్య వయొలెట్ చనిపోయిన డోర్కాపై కోపం చల్లారాక ఆమె శవంపై పడి, ఆమె ముఖాన్ని కత్తితో చెక్కేయాలని ప్రయత్నిస్తుంది.

ఈ విధంగా హింసాత్మకమైన, హృదయ విదారకమైన సంఘటనలను టోనీ మారిసన్ నవలల్లో చూస్తాం. ఈ ఆరు నవలల్లోనూ గత 300 సంవత్సరాల నల్లజాతి అమెరికన్ల చరిత్ర మన కళ్ళకు గడ్తుంది. బానిసత్వపు దుర్భర జీవితాన్ని చిత్రిస్తాయి. ఆమె నవలల్లో మగపాత్రల కంటే స్త్రీ పాత్రలే పాఠకులలో శాశ్వత ముద్ర వేస్తాయి. ఉదాహరణకు 'సూలా' నవలలో అవ్వ; సాంగ్ ఆఫ్ సాల్మన్‌లో రెబా, 'తార్ బేబీ'లో జేడిన్, 'ది బ్లూయెస్ట్' లో వృద్ధ స్త్రీలు జాతి వైషమ్యాలతో

(తరువాయి 39 వ పేజీలో)



## పరిశోధనే ప్రాణంగా జీవించిన బంగోరె

ఆ సాహిత్య పరిశోధకుని పేరు బండి గోపాలరెడ్డి. పరిశోధనే నిత్యోత్సవంగా బతికినవాడు. పరిశోధనా ప్రాజెక్టుల నిర్వాహకులు - ఆయా ప్రాజెక్టులకు ఆర్థిక వనరులు సమకూర్చక, అర్ధాంతరంగా వీటిని ఆపివేయడం సహించలేక, నిరాశకు లోనై ఆత్మహత్య చేసుకున్నాడు బంగోరె. 1982 అక్టోబరు 31న, తన 45వ ఏట, భార్య, ఇద్దరు కొడుకులను వదలి భాక్రాడామ్ వద్ద సట్లెజ్ నదిలోకి దూకి చనిపోయాడు.

ఒక్క బండి కాదు. ఎన్నో బండ్లు పరిశోధనా సామగ్రి కలవాడు గోపాలరెడ్డి అనే మిత్రుల చతురోక్తులు, వాస్తవం కూడా. ఆధునిక తెలుగు సాహిత్య ప్రపంచంలోని ఎన్నో చీకటి కోణాలపై వెలుగును ప్రసరింప చేసిన దిట్ట అతను. తెలుగు సాహిత్యం, తెలుగు చరిత్ర, తెలుగు సంస్కృతి ఏ రీతుల్లో ఏ విధంగా వికసించాయో తెలుసుకోవడం తన వృత్తిగా జీవించాడు. ఆయన పరిశోధనలన్నీ ఆధునిక తెలుగు సాహిత్యానికి కొత్త వెలుగులు ప్రసరింపచేసినవే.

నిత్య జీవితంలోనూ, పరిశోధన జీవితంలోనూ రాజీలేని నిక్కచ్చితనంతో, కపటాన్ని, ద్వేషించే నిష్కపటత్వంతో వ్యవహరించడం ద్వారా ఏర్పడిన అడ్డంకులను ధైర్యంగా అధిగమించలేక, సమాజం పట్ల కసిని పెంచుకొని జీవితాన్ని ఏవగించుకొన్నాడు బంగోరె. ఈ ఒక్క విషయంలో తప్ప, మిగిలిన అన్ని విషయాలలో సాహిత్య కారులకు, సాహిత్య చరిత్ర కారులకు ఆదర్శ ప్రాయుడు బంగోరె. ఆయన మరణించి ఒక దశాబ్దం దాటి పోయింది. ఆయనకు మా నివాళులు తెలియ చేస్తున్నాం.

బంగోరె బాక్రాడామ్ నుండి 31-10-1982న రాసిన ఉత్తరం తెలుగు అనువాదం

బాక్రాడామ్ 31-10-1982

డియర్ సుమిత్ర, సుధీర్, సాగర్ (ఇతర బంధు మిత్రులకు)

మిమ్మల్ని, నన్ను నేనూ మోసం చేస్తూ వెళ్ళిపోతున్నందుకు నన్ను క్షమించండి. నన్ను మరచిపోయి ముందుకు సాగండి. గత కొన్ని నెలలుగా నేను చాల భయంకరంగా, ఏకాకిగా బాధపడ్డాను. నా మేధో సంపన్నమైన జీవితం [illegible] దశకు చేరింది. నాలో నిరాశ భయంకరంగా పెరిగిపోయింది. అందుకే [illegible] ఎవరికీ బయటకు చెప్పుకోలేక పోయాను. నా అధ్యాయం ముగిసింది. [illegible] సహజంగా చివరి దశకు వచ్చింది. నేను ఎవరికీ [illegible] తర్వాత లక్ష్య రహితంగా ఢిల్లీ, హరిద్వార్, ఋషికేశ్, [illegible], బాక్రానంగాల్ డామ్‌లను చూసాను. ఈరోజు నేను [illegible] జలాలలో పడిపోయి నా జీవితాన్ని అంతం చేసుకుంటున్నాను.

డియర్ సుమిత్ర,

మనం పదహారేళ్ళు కలిసి జీవించాం. [illegible] జీవించడం నేర్చుకో.

డియర్ సుధీర్, సాగర్,

మీ మహోన్నతమైన తండ్రి లేకుండా [illegible] బాగా పైకి రండి. నేను మీకు వదిలి వెళ్ళే విష[illegible] వేయండి. అంతా మంచి జరగాలని ఆనందంగా [illegible]

బంగోరె.

---

(37 వ పేజీ తరువాయి)

అతలాకుతలం అయిన అమెరికా దేశపు మూడు శతాబ్దాల [illegible] నిలుస్తాయి ఆమె రచనలు. బానిసత్వం భౌతికమైనదే కాదు — సాంస్కృతికమైనది కూడా. దీనిద్వారా ఒక జాతి అస్తిత్వమే సమూలంగా [illegible] ఉంటుంది. నవలా ప్రక్రియ ఇన్నాళ్ళు పాశ్చాత్య సాంస్కృతిక [illegible] ప్రతీకగా వుంది. ఆ ప్రక్రియపై పాశ్చాత్య ఆధిపత్యాన్ని తొలగించి, నల్లజాతుల గొంతును వినిపించడానికి ఆ ప్రక్రియను సమర్థవంతంగా, ప్రభావవంతంగా [illegible]కోవడమే మారిసన్ నవలల ప్రత్యేకత.

# మరణాన్ని అయిష్టంగా మార్చుకోని బంగోరె

**— డా. సంజీవ్ దేవ్**

ప్రతి ప్రాణీ కూడా ఒక జీవి. తాను జీవి కనుకనే ప్రతి జీవికీ జీవించి వుండటంపై అన్నిటి కంటే మించిన ప్రీతి.

జీవించటం మీది ప్రీతి ఏ జీవినీ మరణించకుండా వుంచజాలదు.

మరణించిన వారిలో కొద్దిమందిని మినహాయిస్తే మిగతా వారందరూ జీవించాలని కోరుతూనే మరణించిన వారు.

బంగోరె మాత్రం ఆ కొద్దిమందిలో వాడు. ఏ కొద్ది మందిలో వాడు? అంటే జీవించాలని కోరకుండా జీవించనివాడు. అంటే మరణించాలని కోరుకుంటూ మరణించిన కొద్ది మందిలోని వాడు.

ఆయన ఇతర్లను ఎన్నడూ చంపలేదు; ఇతర్లు కూడా ఆయన్ను చంపలేదు.

ఆయన్ను ఆయనే చంపుకున్నాడు.

ఆయన్ను నే నెరిగినప్పటి నుంచీ కూడా ఆయనలోని నిద్రాణమై వున్న, తన అచేతనపు పొరల చాటున గుప్తమై వ్యక్తం కావటానికి వేచివున్న suicide Psychology ని నేను, సుస్పష్టంగా కాకపోయినా అస్పష్ట రూపంలో గుర్తించే వున్నాను.

నైరాశ్యవాదిగా ఆశావాదిగా కనపడాలని ఆయన నిరంతర ప్రయత్నించేవాడు. కాని ఆ ప్రయత్నం తనను ఎరిగిన వాళ్ళ ముందు వృథా అయేది. అది వృథా అయినట్లు మాత్రం ఆయన పూర్తిగా గుర్తించేవాడు కాడు.

ఆ గుర్తించక పోవటమే తన ఆత్మహత్యకు కారణమైంది.

బ్రౌన్ పండితుని మీద బంగోరే చేసిన అన్వేషణ అనల్పమైంది. ఆ ప్రయత్నము ద్వారా మరణించి వున్న ఆ మహా పండితుణ్ణి బంగోరె జీవింప చేశాడు, కాని జీవించి వున్న బంగోరెని హత్య చేశాడు.

ఏమేమో సాంస్కృతిక కార్యక్రమాల్లో నేను నెల్లూరు వెళ్ళినపుడల్లా నాతో అంటూండేవాడు "మీరు నెల్లూరు ఎన్నోసార్లు వస్తూంటారు, మరి నేనొక్కసారైనా తుమ్మపూడి రాలేదు," అని. "నేను నెల్లూరు వస్తూంటాను కనుకనే నీవు తుమ్మపూడి రావు, నేను నీకు నెల్లూరులో కనపడుతుంటాను కనుక. నీవు తుమ్మపూడి రావాలంటే నేను నెల్లూరుకు రాకుండా వుండాలి" అని.

అందుకని కాదుకాని, కారణాంతరాలవల్ల ఎక్కువ కాలం వరకు నేను నెల్లూరు పోవటం పడలేదు. చిత్రం ఏమంటే ఒకనాటి సాయంత్రం తెల్ల చొక్కా తెల్ల పాయజామాలో తుమ్మపూడిలోని మా ఇంట నవ్వుతూ ప్రత్యక్షమైనాడు.

ఆత్మహత్యా గ్రహం
— ఖాదర్ మొహియుద్దీన్

అయినవాడు గదాని
ఆత్మహత్యను సయితం
సమర్థించడం కాదు -
సగం నలిగి చిత్తయిన గొంగళీ పురుగు
గచ్చు నేల మీదపడి తడితడిగా
తన ఎలిజీ తనే రాసుకుపోతున్నట్టు
బతుకును మరణ శాసనంలా
మోసుకు తిరిగే వాళ్ళ కిది అర్థం కాదు
మృత్యువును కాదు
ఎంత ఘోరంగా వున్నా
బ్రతుకునే ప్రేమించిన మనిషి —
మనుషుల మధ్య
మనుషుల కోసం వెతుక్కున్న మనిషి
మనిషి మీదా
మనిషి మంచితనం మీదా
మంచి భవిష్యత్తు మీదా

← తరువాత కొంత కాలానికి వాల్తేరులో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో కనిపించాడు బ్రౌన్ మీద గవేషణ కాలంలో. అప్పటికే ఆయన ముఖంలో సుమారంకాని మృత్యు ఛాయలు కదులుతూ కనిపించాయి.

"ఇంకా ఎంతకాలం ఈ భూమి మీద" అన్నాను.

సిగ్గు సిగ్గుగా, వణికే పెదవులను వణకకుండా చేసు ప్రయత్నిస్తూ అన్నాడు. "మీకే తెలియాలి" అని.

"నాకు తెలుసు కాని, నాకు తెలిసిన దానికి వ్యతిరేకంగా వర్తించే మానస సత్తాను నీవు తయారు చేసుకోవాలి. ప్రయత్నం బలీయంగా వుంటే తన కిష్టమైన దానిని కూడా మనిషి అయిష్టంగా మార్చుకోవచ్చు.

"మరణం తనకిష్టం అయితే దాన్ని తన కయిష్టంగా మార్చుకోవచ్చు అన్నాను.

ఆ విధంగా మార్చుకో లేకపోయాడు బంగోరె.

నమ్మకాన్ని నిర్మించుకున్న మనిషి
ఉన్నట్టుండి,
ఊపిరి తీరాన్ని దాటి
అనంత వాయువీనంలో
గానంగా మారడమేమిటి?

ఎందు కిలా జరిగింది?
సంక్షుభిత శరీరాన్ని
శాంత పరచి శుశ్రూష చేసిన
సట్లెజ్ నదీ జలాలు
సమాధానం చెప్పలేవు
నవ్వుకుంటూ
నాలిక చప్పరించుకుంటూ

నీళ్ళలోంచి నీడల్లోకి వెళ్ళిపోయిన
ఖడ్గ మృగాన్ని అవి గుర్తు పట్టలేవు
నిండు సూర్యుణ్ణి అవనతం చేసి
కళేబరానికి కుంకుమ పూజ జరిపిన
ఆకాశానికీ యిది అర్థం కాదు
పంచ భూతాలకీ
పండంటి జీవితాలకీ మధ్య
మనిషికీ మస్తిష్కానికీ మధ్య
వ్యక్తికీ సమూహానికి మధ్య
గోడల్ని నిలువునా కూల్చితేనే తప్ప
నీడలు నిజాన్ని విప్పవు

తనువును ధనువును చేసి
ప్రాణాన్ని బాణంలా సంధించడం
ఆత్మహత్య అవుతుందా?
అది ఆత్మహత్య కాదు— ఒక ఆగ్రహ ప్రకటన
అది ఆత్మహత్య కాదు — బాధాగ్ని కణాల సంఘటన
అది ఆత్మహత్య కాదు — అభివ్యక్తి అంతిమ రూపం
అది ఆత్మహత్య కాదు — ఒక అంతులేని పోరాటం
అది ఆత్మహత్య కాదు — ఒక రాజీ లేని పోరాటం
వంచనా భీభత్స సర్వస్వంలో

# బంగోరె జ్ఞాపకాలు

## — కృష్ణాబాయి

ఏ వేకువ జామునో అదాటుగావచ్చేసి 'ఏమ్మా శ్రీశ్రీపుస్తకాలింకా అయిందా లేదా? మరింక కొడవ గంటివి ఎప్పుడు? సంగీత సాహిత్యాల దగ్గర్నుండీ అన్నిటి మీదా కట్టలకొద్దీ రాసిపడేశాడు గద!' అంటూ బంగోరె నిద్రలేపుతాడనే ఆశ, 11 ఏళ్ళయినా మిగిలే వుంది. నాకేగాదు, మిత్రులందరికీ కూడా.

నాకు తెల్సినంతవరకూ బంగోరె ఎప్పుడూ ఒంటరిగా వుండాలనుకునే వాడు కాదు. ఎందరితోనో ఎన్నదగిన పరిచయాలున్న వ్యక్తి. స్నేహమంటే ప్రాణం. సంగీతమన్నా సాహిత్యమన్నా పిచ్చి. జర్నలిజం, సినిమాలు, చరిత్ర - ఒకటేమిటి, అతని అభిరుచులనేకం. ఇన్ని అభిరుచులూ, వ్యాపకాలు వున్న మనిషి అర్ధాంత రంగా ఎందుకు అదృశ్యమయాడా అని బాధ ఉంగలు చుట్టేస్తూంటుంది. ధనకాంక్షో, కీర్తికాంక్షో వున్నా బతికేవాడేమో ననిపిస్తుంది. ఇవేళ ఎందరో యువకులు ఉద్యోగ భద్రతకోసం పడేపాట్లు చూస్తూంటేబంగోరె ఎంత వున్నతుడో ననిపిస్తుది. బంగోరె కూడా తన ప్రవృత్తికి సరిపడని వృత్తులు కొన్ని చేశాడు. కాని తన సున్నితమైన మనస్సు చివుక్కుమంటే చాలు, ఆ వుద్యోగాన్ని ఏం ఖాతరు చేయకుండానే అవలీలగా ఒదిలేసేవాడు.

నేటి సమాజంలో విలువలు తారుమారవుతున్నాయి. జీవితం సాంతం వ్యాపా రమైపోయింది. మంచి మానవ సంబంధాలు ఎండమావులతున్నాయి. ఇవి అందరికీ అనుభవంలో కొచ్చిన విషయాలే. మన సమాజానికి సంబంధించినంతవరకూ ఈ విధ్వంసం 1980 లలో మొదలైంది. తెలుగునాట సాంస్కృతిక రంగంలో దీనికి తొలి బలిపశువు బంగోరె. అంటే 1980కి ముందు అంతా సజావుగా వుందని కాదు, సక్రమంగా సాగిందనీ కాదు. మంచి మార్పయినా, చెడ్డ మార్పయినా ఒక్కసారే ఊడి

---

← మానవునికి తన కంటూ మిగిలిన
ఒకే ఒక్క ఆయుధం శరీరం
అయితే, అది
ఆయుధ నిమజ్జనం కాదు
ఆత్మ విచ్ఛేదనం
ఆత్మ విస్ఫోటనం.
- - - (బంగోరె ఆత్మహత్యకు ప్రతిస్పందన) 'పుట్టుమచ్చ' సౌజన్యంతో

పడదు. దాని బీజాలు సూక్ష్మ రూపంలో పాత సమాజంలో వేరుతన్ని వుంటాయి. మన రాజకీయ రంగం దొంగ నోట్లకి, దొంగ ఓట్లకి దసోహమంటోంది. ఆర్థిక రంగమేమో పరాధీనమైపోయింది. మన కాళ్ళమీద మనం నించునే పరిస్థితి లేదు. మనదంటూ మనకేమీ మిగలకుండా పోతోంది. ముఖ్యంగా శాస్త్ర సాంకేతిక రంగాల్లో ప్రోత్సాహం పూజ్యమైపోయింది. ఈ నిరాశతోనే నిపుణులు, మేధావులు వలసపోతున్నారు. ఇవాళ విదేశాల్లో పెద్ద సంఖ్యలో వున్న భారతీయుల్ని చూస్తే ఇది స్పష్టమవుతుంది. సాంస్కృతిక రంగంలోకి కొట్టుబడి ధారాళంగా ప్రవహించింది. పాడికుండలాంటి పదిలమైన ఉద్యోగాల్ని ప్రభుత్వం ఎరవేసింది. ప్రలోభాలకీ, ఆకర్షణలకీ లోనైన మన మేధావులు ప్రభువుల పంచన చేరారు. నిజాయితీగా నిలబడి ప్రభుత్వాన్ని నిగ్గదీసినవారు, ప్రజల వైపు మొగ్గారు. బంగోరె అటు ప్రభువుల పంచనా చేరలేకపోయాడు. ఇటు ప్రజలతో పూర్తిగా మమేకమూ కాలేకపోయాడు. చిత్త శుద్ధితో, దీక్షతో కొన్ని ప్రాజెక్టులు చేపట్టాడు. కాని వ్యాపార నాగరికత, లాలసత్వం బ్యూరాక్రసీ బంగోరెకి యమపాశాలుగా తగులుకున్నాయి.

తను చేసే ప్రతి పనినీ ఛాలెంజిగా తీసుకునేవాడు. తిరుపతిలో బ్రౌన్ ప్రాజెక్టు, హైదరాబాదులో వేమన కేంద్రం, విశాఖలో సి.ఆర్. రెడ్డి ప్రాజెక్టు. బ్రౌన్‌కి సంబంధించిన పని మాత్రంమనసారా తాననుకున్న రీతిలో పూర్తి చేయగలిగాడు. చివరి రెండూ బంగోరెని బలి తీసుకున్నాయి. ఎంతో చేద్దామనీ, ఎన్నో సాధిద్దామనీ ఆత్మ విశ్వాసంతో అచంచల దీక్షతో ప్రయత్నాలు చేశాడు. కాని అడుగడుగునా ముళ్ళూ రాళ్ళే.

బంగోరె యూనివర్శిటీలో (1954) చేరేముందే ఇంజనీరింగ్‌లో సీటొచ్చింది. కాని కామర్స్ ఇంకా మంచిదని బి.కాం. (ఆనర్స్) లో ఆంధ్ర యూనివర్శిటీలో చేరాడు. అయితే జీవితంలో మాత్రం ఏనాడూ కమర్షియలైజ్ కాలేదు. అన్యాయం, అక్రమం ఎక్కడ కనిపించినా భగ్గుమనేవాడు. మల్లంపల్లి సోమశేఖర శర్మగారిలాంటి గొప్ప చరిత్ర పరిశోధకుడు 'డిగ్రీలు లేని పాండిత్యంబు వన్నెకు రాని ఈ పాడుకాలాన బుట్టి' నందన ప్రొఫెసర్ కాలేకపోయాడని వుడికిపోయేవాడు.

'బంగారు పాప' లాంటి ఉత్తమ చిత్రం నిర్మించిన బి.ఎన్. రెడ్డి 'రాజమకుటం' లాంటి జానపద చిత్రం తీయడమేమిటనే బాధతో కూడిన ఆగ్రహంతో ఓ జాబు రాశాడాయనకి. పూర్వాపరాలు వివరిస్తూ బి.యన్. రాసిన జాబు చూసి బొటాబొటా కన్నీరు కార్చాడు - 'ఆ మహానుభావుణ్ణి బాధపెట్టానే' అని. అంతటి ఆర్ద్రతగల బంగోరెలో వుద్రేకమూ అసహనమూ కూడా ఎక్కువే.

పనికిమాలిన చెత్త కావ్యాలు కుప్పలు తెప్పలుగా వచ్చిపడుతున్నాయని ఒక ఓపెన్ ఏయిర్ థియేటర్‌లో వ్యంగ్య రూపకం ఆంధ్రా యూనివర్శిటీలో ప్రదర్శింపజేశాడు. దానిపేరు 'కావ్యదహన మహోత్సవం'. కామర్స్ చదువుతూన్న రోజుల్లోనే మిత్రులతో కల్సి 'స్రవంతి' అనే పత్రికను నడిపాడు. కొద్ది కాలమే వచ్చినా సలసల కాగుతుండేదా స్రవంతి.

కేరళ రచయితలకి సహకార ప్రచురణ సంస్థ వుండేది. పుస్తక ప్రచురణ, పంపిణీ అన్నీ ఆసంస్థద్వారా జ-గేవి. డిప్లమా ఇన్ కోఆపరేషన్ చేస్తూన్న బంగోరె మన తెలుగు రచయితలకూ కూడా అలాంటి సంస్థ వుండగం అవసరమని భావించివిశాఖ రచయితల్ని సమీకరించాడు. చేతిలో పైసా లేదు. నెల్లూరులో తను అపురూపంగాదాచు కున్న పుస్తకాలమ్మేసి, ఆ డబ్బుతో కేరళ సహకార సంస్థని స్టడీచేసేందుకు వెళ్ళాడు. కేరళ ప్రకృతి సౌందర్యాన్ని, 'పెరుక్కుపోతున్న దరిద్రాన్నివర్ణిస్తూ, ఉత్తరాలురాసే వాడు. అక్కడి పరిస్థితులన్ని ఆకళింపు చేసుకొని తిరిగొచ్చేసరికి ఇక్కడి పరిస్థితి మారిపోయింది. రచయితల్ని మోసం చేశాడనీ సొమ్ముకాజేశాడనీ కొందరు పని గట్టుకుని ప్రచారం చేశారు. ('గురజాడని అకవి'గా చిత్రించిన వాళ్ళకి బంగోరె ఒక లెక్కా?) బంగోరె సున్నిత మనస్సు తీవ్రంగా గాయపడింది. తట్టుకోలేకపోయాడు. దాంతో మరెవ్వరికీ చెప్పా పెట్టకుండా వెళ్ళిపోయాడు. ఏమైపోయాడోనని అంతటా గాలిస్తుండగా, బొంబాయి సముద్ర తీరంలో జాలర్లు రక్షించి రచయిత బుచ్చిబాబు యింటికి చేర్చారని తెల్సి కుదుటపడ్డాం. బతికి బయటపడ్డ బంగోరె కొన్నాళ్ళు ఆంధ్రజ్యోతిలో నార్ల వెంకటేశ్వరార్రావు దగ్గర సబ్ ఎడిటర్‌గా పనిచేశాడు. ఈ లోగా కో-ఆపరేటివ్ బ్యాంక్‌లో సెక్రటరీగా వుద్యోగ మొచ్చింది. కొద్ది కాలంలో కడప బ్యాంకి అధ్యక్షుడి నిరంకుశత్వానికి తలొగ్గలేక ఆ వుద్యోగానికి రాజీనామా చేసేశాడు. ఆ రోజుల్లోనే కడపలోని గాచమల్లు రామచంద్రారెడ్డి మిత్రబృందంతోనూ కావలి కె వి ఆర్ తోనూ సన్నిహితత్వం. శ్రీపాద గోపాల కృష్ణమూర్తి, బుచ్చిబాబు, కాళోజీ, గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, అచంట జానకిరామ్, సంజీవ్‌దేవ్ మొదలైన సాహితీ కళావేత్తలతో నిత్యసంబంధాలు పెట్టుకునేవాడు. కె.వి.ఆర్, దిగవల్లి వెంకట శివరావుల్ని మార్గదర్శకులుగా ఎంచుకున్నాడు.

1966లో సుమిత్రతో పెళ్ళయి, సుధీర్, సాగర్ పుట్టినా కుటుంబ జీవితానికి పరిమితం కాలేదు బంగోరె. సుమిత్ర లెక్చరర్‌గా సంసారాన్ని నెట్టుకొస్తుంది. "సుమిత్ర ... కావల్సిన మనశ్శాంతి నిచ్చి కొండంత అండగా నిలుస్తుంది" అని చెప్పే బంగోరె తన పరిశోధనా రంగంలోనే మునగానాం తేలానాంగా వుండేవాడు. అందుకే కాళోజి 'అసలే బంగోరె, ఆపైన పుస్తకం' అని హాస్య మాడేవారు. బంగోరెకి ఖలీల్ జిబ్రాన్ 'ప్రొఫెట్' (prophet) ప్రాణం. మాదగ్గర్నుంచి వెళ్ళే

ప్రతిసారి 'Ship is waiting for me ఇంక వెళ్ళొస్తానమ్మా' అనేవాడు జీబ్రాన్ లాగా.

బంగోరె ప్రచురించిన పుస్తకాల ముందు మాటలు, పీఠికలు చదివినా అతని ఆరాటం, పట్టుదల, కృషి అర్థమవుతాయి. చిన్న కొస కనిపిస్తే చాలు 'తీగలాగి డొంకంతా కదిలి'స్తాడు. ఓసారి అతను బెజవాడ వచ్చే సరికి, 'క్రితం రోజే మేం విరసం తరపున మాలపల్లి నవల మీద గోష్ఠి నిర్వహించామనీ తుమ్మల వెంకట్రామయ్య గారు ఫలనారకంగా మాట్లాడార'నీ చెప్పాను. తర్వాత పత్రికలో రిపోర్టు చదివాడు. హుటాహుటి వెంకట్రామయ్యగారి దగ్గరకి వెళ్ళాడు. ఆయనతో మాట్లాడి, తర్వాత మద్రాసు ఆర్కైవ్స్‌కి వెళ్ళి క్షుణ్ణంగా పరిశోధించి 'మాలపల్లి నవలపై ప్రభుత్వ నిషేధాలపై పరిశీలన' పుస్తకం ప్రచురించాడు. అలాంటిది అతని పట్టుదల.

అప్పటికే 'జమీన్ రైతు'లో ఉప సంపాదకత్వం నిర్వహించడం, లోకలిస్టు పేరుతో 'కూనిరాగాలు' శీర్షిక నిర్వహించడం, 'తొలి కన్యాశుల్కం' ఫుట్‌నోట్స్‌తో ప్రచురించడం, సుబ్రహ్మణ్య భారతి, వీరేశలింగం దంపతుల్ని నాయకీ నాయకులుగా 'చంద్రిక కథ' అనే అసంపూర్తి నవల రాయగా దాన్ని మిత్రులతో కలిసి ప్రచురించడం లాంటి పనులు చాలా చేశాడు. ఎక్కడెక్కడో నేల మాళిగల్లో దాక్కున్న బ్రౌన్ జాబు లెన్నిటినో సేకరించి 'తెలుగు జర్నలిజం చరిత్ర'గా ప్రచురించాడు. నిజమైన పరిశోధకుడు చిత్తశుద్ధితో ఎంత అవిరళ కృషి చేయాలో తెలుగు దేశానికి నేర్పాడు బంగోరె. అందుకే 'నిజానికి 1970-80 దశాబ్దం పరిశోధనా రంగంలో నిస్సందేహంగా బంగోరెది' అన్నారు కె.వి.ఆర్.

తమిళనాడు ఆర్కైవ్స్‌లో తారసిల్లే పరభాషల, పరదేశాల చరిత్ర విద్యార్థుల సంఖ్యతో పోలిస్తే 'తెలుగు చరిత్రాన్వేషకుల సంఖ్య స్వల్పాతి స్వల్ప'మని బాధ పడ్డాడు.

మొదటిసారి ఆర్కైవ్స్‌లో బంగోరెకి ప్రవేశం నిరాకరిస్తూ నువ్వు రీసెర్చి స్కాలర్ వని సర్టిఫికెట్ తెమ్మన్నారు అధికారులు. తను చదివిన యూనివర్శిటీ నుంచి ఆ సర్టిఫికెట్ వచ్చే అవకాశం లేదు. ఆఖరికి బంగోరె తపన గుర్తించిన మద్రాస్ యూనివర్శిటీ లైబ్రరీ సైన్సు రీడర్ మిత్రుడి సర్టిఫికెట్‌తో ప్రవేశం సాధ్యమయింది. ఆనాటి నుంచీ బంగోరె "దృష్టి, జీవనపథం మారాయి. ప్రవృత్తీ, ప్రవృత్తితో పాటు వృత్తీ వ్యసనంగా మారాయి."

ఏ విషయం తీసుకున్నా దాని లోతుల్లోకి చిచ్చర పిడుగులా దూకి దాని అంతు తేల్చేవాడు. పరిశోధనా రంగంలో అశ్రద్ధతో బద్ధకంగా పనిచేసే వారినీ, నిజాయితీ

లేనివారినీ చీల్చి చెండాడ్డంలో 'చిన్నంతరం పెద్దంతరం' పాటించేవాడు కాదు. అందుకే బంగోరె పేరు చెప్తే చాలా మందికి పక్క బెదురు.

ఒక విషయాన్ని పరిశోధించడమే కాదు, దాన్ని ప్రెజంట్ చేసేటప్పుడు వర్తమాన పరిస్థితులతో జత చేసి మరీ చెప్పేవాడు.

1975 సెప్టెంబరులో జె. మంగమ్మగారి Book Printing in India ప్రచురిస్తూ 'In bringing out this book I could not have the benefit of frank criticism of some intelectuals, who are now unhappily in prison', అంటాడు మనవిలో చాడీగా.

1977లో 'బ్రౌన్ జాబులు- తెలుగు జర్నలిజం చరిత్ర' పుస్తకాన్ని ప్రచురిస్తూ బంగోరె తన ముందు మాటలు ఇలా ముగించాడు:

"సృజన, పిలుపు పత్రికల సంపాదకులు వరవరరావు, ఎం.టి. ఖాన్‌లను ఘనత వహించిన ఆం.ప్ర. ప్రభుత్వం ఆంతరంగిక శాంతి భద్రతల పరిరక్షణ చట్టం క్రింద అరెస్టు చేసి జైల్లో కుక్కిన వార్తను ఇప్పుడే చదివాను. నేను ఆ జాతి జర్నలిస్ట్‌ని గాక పోవచ్చు. నాదీ జర్నలిస్టుల జాతే గనుక- ఈ దుర్మార్గపు ఘడియలలో నగిషీలు చెక్కుకుంటూ ఏదో వ్రాయడం సబబు కాదు. ఇద్దరూ పత్రికల ఎడిటర్లు. అలనాడు గాడిచెర్ల హరిసర్వోత్తమరావు, మళ్ళీ ఇప్పుడు వీరు.... తెలుగు జర్నలిజం చరిత్ర ఈనాడు ఎంత దాకా వచ్చిందో ఈ సన్నివేశమే చెబుతున్నది. శాంతిని గాని, అశాంతిని గాని భగ్నం చేయగలిగిన సత్తా కలిగిన సంపాదకులున్నారని ప్రభుత్వమే ఈ రూపంలో చెబుతున్నది. అందుకు గర్వించవలసిన సమయం ఇది. అలనాడు 'కృష్ణాపత్రిక'లో సంపాదకీయాల ద్వారా ముట్నూరి అగ్ని వర్షం కురిపించారు. ఆ వంతు ఇప్పుడు మరొకరిదైంది.... ఈ చరిత్ర పరిణామాన్ని తలుచుకుంటూంటే గర్వ పడవలసి వస్తుంది. ఇట్లా తెలుగు జర్నలిజం చరిత్ర వికాసానికి గర్వపడుతున్నాను. వళ్ళు ఉడుకెత్తుతున్నది. ప్రభుత్వం ఈ అగవానికి దిగినందుకు అధిక్షేపిస్తూ, నిరసన తెలియ జేస్తూ ఫుల్‌స్టాప్."

— బంగోరె

అంతే కాదు, 'వర్తమాన తరంగిణి' పత్రికలో వచ్చిన రెండు వార్తలకి 'అనాటి నక్సలైట్లు' అనే శీర్షిక పెట్టి ఫుట్‌నోట్స్‌లో 'అధికార బధిరాంధుల' చేతుల్లో న్యాయం దొరక్క విసిగి వేసారి దౌర్జన్య మార్గమే మిగిలిన ఏకైక రాజ మార్గమని నమ్మి ధర్మం చెప్పమని ప్రభుత్వాన్ని నిలదీసి అడిగిన సామాన్యులు వీరు. నేటి నక్సలైట్లు జ్ఞాపకం రాక మానరు. దరిద్రం, నిరుద్యోగం, అవినీతి, అక్రమాలు చూచి సహించలేక.... సాయుధ పోరాటానికి అయత్త మవుతున్న నక్సలైట్ల ధోరణికి సామ్యం...." అంటాడు బంగోరె.

శ్రీ వెంకటేశ్వర యూనివర్శిటీలో బ్రౌన్ ప్రాజెక్టు రీసెర్చి ఆఫీసరుగా చేయవలసిన పరిశోధనంతా తృప్తిగా చేసి, పుస్తకాలు ప్రచురించాడు. ఆ కాల పరిమితి అయిపోయాక నూలపల్లి నిషేధాల మీద పనిచేసి పుస్తకం పూర్తి చేశాడు. హైద్రాబాదులో యోగివేమన విజ్ఞాన కేంద్రం రీసెర్చి ఆఫీసరుగా చేరాడు 1980లో. వేమనకి సంబంధించి మూడు చిక్కు ముడులున్నాయి. వాటిని ఎలాగైనా విప్పాలని కంకణం కట్టుకున్నాడు. వేమన ఎప్పటి వాడు? ఎక్కడి వాడు? అసలు సిసలు వేమన పద్యాలేవి? ఇవన్నీ శోధించగల దీక్ష, దక్షత, ఓర్పు, ఒడుపు బంగోరెకి దండిగా వున్నాయి. దాని వల్లనే 141 సంవత్సరాల క్రితం (1839లో) అదృశ్యమై పోయిన వేమన పద్య ప్రతి (సి.పి. బ్రౌన్ సంకలనం) ఫొటో కాపీ లండన్ లైబ్రరీ నుంచి మిత్రుని సాయంతో సాధించాడు. 'వేమన పద్యాలు- సి.పి. బ్రౌన్ 1839 నాటి సంకలనం'గా ప్రచురించాడు. తన దగ్గరున్న సమాచారంతో మరెన్నో వెలువరించాలని కలలు కన్నాడు. వేమన పద్యాలు Standard and definitive edition వేయడానికి పథకం సిద్ధం చేసుకున్నాడు. కాని మన అంధేరా ప్రభుత్వపు అవకతవక పనుల వల్ల ఆ ప్రాజెక్టు మూలపడింది. 'You are the most stupid IAS officer I have ever worked under' అని, చక్కా వచ్చేశాడు. జీత భత్యాలు కూడా సరిగా ఇవ్వకుండా యింతటి పరిశోధకుణ్ణి తరిమేయ గల్గిన 'గొప్ప వ్యవస్థ' కదా మనది!

1981లో ఆంధ్రా యూనివర్శిటీలో సి.ఆర్. రెడ్డి శతజయంతి ఉత్సవాల సందర్భంగా ఏర్పడిన రీసెర్చి కేంద్రంలో ప్రాజెక్టు ఆఫీసరుగా చేరాడు బంగోరె. నిజాని కతనికి చాలా నచ్చిన వూరు విశాఖపట్నం. తను మనసిచ్చి పుచ్చుకున్న మిత్రు లెందరో యిక్కడున్నారు. తనకి నచ్చిన తీరులో పని చేసే పరిస్థితు లున్నాయనుకుని వచ్చి చేరాడు. పని జోరుగా సాగుతోంది. కాని 'సొమ్మొకడిది, సోకొకడిది' చందం అయింది. రాబందులు అడ్డు పడ్డాయి. ఇంక విసిగి వేసారి పోయాడు బంగోరె. తాను పరిశోధించిన అంశాలన్నీ ఫైళ్ళలో బిగించి యూనివర్శిటీకి అప్పగించేశాడు. (ఇప్పటికీ ఆ ఫైళ్ళకి అతీ గతీ లేదు. ఆ అమూల్యమైన విషయాల్ని ప్రచురించే శ్రద్ధ, ఓపిక ఎవరికున్నాయి? ఎవరి vested interests వాళ్ళవి).

మిత్రులు విశాఖలో బంగోరెకి వీడ్కోలు సమావేశం ఏర్పాటు చేశారు. (అక్టోబరు, '82). అప్పుడందరి గుండెలూ బరువెక్కాయి. సాగర తీరాన్నుంచీ సెలవంటూ వెళ్ళిపోయాడు. నిజానికి అతనప్పటికే ఒక నిశ్చయాని కొచ్చాడేమో- ఈ లోకం నుంచే శాశ్వతంగా సెలవు తీసుకుందామని. ఆ సంగతి మిత్రులప్పుడు పసికట్టక పోయినా వారి వీడ్కోలు కవితలన్నీ ఎలిజీలు గానే మిగిలిపోయాయి.

# బంగోరె పై సన్నిహితుల జ్ఞాపకాలు

"రాత్రింబవళ్ళు డెవిల్ లాగ ఎప్పుడూ తన పరిశోధనల పైనే కేంద్రీకరించే వాడు. తిండి మీద ధ్యాస వుండేవి కాదు. గంటల తరబడి పుస్తకాల్లో కూరుకు పోయేవారు. సాహిత్య విషయాల్లోకి పోతే ఇక ఏమీ పట్టించుకునే వారు కాదు.

"నాకు సాహిత్యం మీద పెద్ద Interest లేదు. కేవలం గృహిణి గానే వుండే దాన్ని. ఆయన రచనలకు నా Contribution ఏమీ లేదు- సహకారం అందించడం తప్ప".

"ఆయన చేపట్టిన ఏ పథకమూ పూర్తి కాలేదు ప్రతీ చోటా దెబ్బ తింటూ వచ్చారు. ఎవరితోనూ రాజీ ధోరణి లేదు".

"సి.ఆర్. రెడ్డి ప్రాజెక్టు పనిలో రెండు పుస్తకాలు తయారు చేసారు. ఒకటి తెలుగు. మరొకటి ఇంగ్లీషు. ఇంగ్లీషు పుస్తకాన్ని ఈయనా, మరో ఇంగ్లీషు ప్రొఫెసరూ కలసి చేసారు. అయితే ఆ ప్రొఫెసరూ ఆ పుస్తకానికి తన ఒక్కరి పేరే పెట్టుకుంటానన్నారు. ఆవుల సాంబశివరావు గారు రాజీ కుదిర్చారు.

"సంపాదన విషయంలో ఏ మాత్రం పట్టించుకునేవారు కాదు. నేనే ఆయన్ని విసిగిస్తూ వుండేదాన్ని, పిల్లలు పెద్దవాళ్ళవు తున్నారు. అవసరాలు పెరుగుతున్నాయి ఇలాగైతే ఎలా ? అని".

"మొదట్లో పుస్తకాలు ఇన్సూరెన్స్ కంపెనీ నుంచి తీసుకున్న అప్పుతో, బ్యాంకులు ఇచ్చే అప్పుతో ప్రచురించారు. ప్రచురించడమే కాని వాటిని అమ్ముకోవాలనే ఉద్దేశం లేదు".

"ఆయన భార్యగా ఎప్పటికైనా అటువంటి వాడే నాకు భర్తగా కావాలని కోరుకుంటున్నాను".

—సుమిత్ర బంగోరె

← 1975లో నెల్లూరు 'యూత్ కాంగ్రెసు' పత్రికలో కొలువు మానేస్తూ బంగోరె అన్న మాటలు అతని జీవిత చరమాంకానికి చక్కగా వర్తిస్తాయి.

"అందుకే ఉన్న మేరకు నా గుండెను పిండి తునాతునకలు చేసి మీ ముందు వెదజల్లాను. నా కాంక్షల సంతానాన్ని మీ ముందు దిసమొలతో కేరింతలతో తచ్చాడే లాగున చేశాను. బాధతో గాక, బరువు గుండెతో కాక ఇప్పుడు ఏదో బంధాన్ని, అనుబంధాన్ని తెంపకుని ఎడబాసి పోవాలంటే చేతకావడం లేదు. తృష్ణతో, దప్పికతో తీపెక్కిన హృదయాన్ని విడిచి వెళ్తున్నానా అనిపిస్తున్నది.

"విపులాచ పృథ్వీ— ఈ రకం బ్రతుకు మా జర్నలిస్టులకు పరిపాటే". ●

— బంగోరె

"జమీన్ రైతులో పని చేసేటప్పుడు ఒంగోలె ఇద్దరు యువతుల మరణం గురించి ఇచ్చిన రిపోర్టు చరిత్రాత్మకమైనది. మైపాడు బీచ్‌లో కళారాణి, చండికా రాణి అనే ఇద్దరమ్మాయిలపై లైంగిక దాడి చేసి కాల్చి చంపేసారు. దీనిపై అయన పరిశోధన జరిపి, దోషులకు శిక్ష పడేట్లు చేశారు. ఆ అమ్మాయిల తల్లి బొంబాయిలో పెద్ద చిత్రకారిణి. తండ్రి లాయరు. ఒంగోలు వాళ్ళు. నెల్లూరు కాలేజీలో చదివే వారు. అయితే స్వేచ్ఛగా తిరిగే వారు. వీరి హత్య గురించి జమీన్ రైతులో ధారా వాహికంగా ప్రచురించారు. ఈ రిపోర్టునే 'టైమ్స్ ఆఫ్ ఇండియా' మొదలగు పత్రికల వారు పునః ప్రచురించే వారు".

"వెళ్ళిపోయే రోజో, ముందు రోజో నా దగ్గరకు వచ్చాడు. చాలా frustreted గా వున్నాడు. ఏమైంది- బ్రాంకైటిస్ వచ్చిందా అని అడిగాను. 2½ గంటలు కూర్చుని టీ తాగి వస్తానని చెప్పి పోయినాడు. ఏదో చెప్పాలనుకున్నాడు- చెప్ప కుండా వెళ్ళిపోయాడు".

"అయితే సట్లెజ్ నదిలో దూకినప్పుడు అతన్ని కాపాడాలని అక్కడున్న వాళ్ళు మోకులు, త్రాళ్ళు విసిరారు. అయితే వాటిని పట్టుకోను అని చెయ్యి వూపాడు. 5 నెలల తర్వాత శవం దొరికింది.

వనమాలి (జమీన్‌రైతు)

"బి కామ్ (ఆనర్స్) అయిన తర్వాత సరైన ఉద్యోగం దొరక్క- ఏ గాలి ఎటు తోస్తే అటు వెళ్ళాల్సివ పరిస్థితి వచ్చింది అతనికి."

"భార్యపట్ల చాల గౌరవంగా మాట్లాడే వాడు. చాల కష్టాలు పెడ్తున్నాననే వాడు".

"అతనికి జీవితం మీద ఆపేక్ష లేదు. సినిమా చూడడు. మాయాబజార్ చూడలేదు. మాయాబజార్ చూడని అంధుడుంటాడా".

"నీ జీవితాశయం ఏమిటని అడిగితే- స్టేట్ ఆర్కైవ్స్ (రాష్ట్ర పురావస్తు శాఖకు) డైరక్టర్ కావాలని వుంది అనేవాడు".

"సి ఆర్. రెడ్డి అంటే విపరీతమైన ప్రేమ. ఆయనపై 100 ఫైళ్ళు తయారు చేసి యూనివర్శిటీకిచ్చాడు".

"depth, width, worth వున్న మనుషులంటే ఎక్కువ గౌరవం అతనికి. శ్రీశ్రీ కంటే ఆరుద్రను ఎక్కువ ఇష్ట పడేవాడు. ఎందు కంటే పై మూడు గుణాలు ఆరుద్రలో వున్నాయి. శ్రీశ్రీకి లేవు గనుక. ఈ గుణాలు లేని వాళ్ళను ఏ మాత్రం లెక్కపెట్టే వాడు కాదు.

"సినిమాల గురించి, నటీ నటుల గురించి మాట్లాడితే తిట్టేవాడు. 'ఛీ- అడ్డ మైన గడ్డి మాట్లాడతావ్' అని.

"అభ్యుదయ కవిత్వం మీద ప్రారంభం నుండి నేటి వరకు ఒక పుస్తకం నా చేత రాయించాలనుకున్నాడు. ప్రోత్సహించాడు."

"నక్సలైట్లన్నా, రాడికల్స్ అన్నా ఇష్టపడే వాడు. ఎందు కంటే ప్రాణ త్యాగం చేసే వాళ్ళ పట్ల గౌరవం".

"అతడు నాస్తికుడు. దేవుని మీద గానీ, మార్క్స్ మీద గాని అతనికి ప్రేమ, విశ్వాసం లేవు. ఎవరి పైన వున్నా ఇలా చనిపోయేవాడు కాదు. ఈ రెండింటి పైనా కాక సాధారణమైన వ్యక్తులపై విశ్వాసం వుంచేవాడు. ఆ వ్యక్తులు ఎప్పుడు అతన్ని మోసగించే వారో అప్పుడు బాధ పడేవాడు.

"సంగీతం అంటే కొంచెం ఇష్టం. మల్లేశ్వరి, సైగల్ పాటలు కూనిరాగాలు తీస్తుండే వాడు".

"అతనికి బ్రౌన్ ఫొటో దొరికి వుంటే జీవితాశయం నెరవేరినట్లు భావించి వుండే వాడు.

"ఒక విషయంలో నుంచి మరో విషయంలోకి గెంతేవాడు. బ్రౌన్ కారణ జన్ముడనీ, తెలుగు సాహిత్యానికి మహోపకారం చేశాడని అంటుండే వాడు.

"హిస్టరీ కాంగ్రెసు సమావేశాలకు వెళ్తూ సెమినార్లు వినేవాడు".

"ఏదైనా ఒక గ్రంథాలయానికి హైదరాబాద్‌లో గానీ, నెల్లూరులో గానీ- ఇంకా ఏదో ఒక వూరిలో బంగోరె పేరు పెట్టడం బాగుంటుంది. దానికి అతను అర్హుడు."

— చందు సుబ్బారావు, విశాఖ

"పనిలో రాక్షసుడు. సమాచార సేకరణలో అతన్ని మించిన వాడు లేడు. తెలుగు డిగ్రీ లేకపోయినా తెలుగు సాహిత్యంపై పరిశోధనలు చేసాడు. తెలుగు యం.ఏ. చదివి, పరిశోధనలు చేస్తున్న వారిలో బంగోరె చేసిన దానిలో 10 శాతం చేసినా చాలు అన్పించేది".

"అతనిపై ఒక ఆరోపణ వుంది. సేకరించిన సమాచారాన్ని విశ్లేషించడంలో కొంత తొందరపడి చేసే వ్యాఖ్యానాలు అనవసరంగా సంచలనాన్ని, కొందరికి మన స్తాపాన్ని కల్గించిన సంఘటనలున్నాయి. ఒక విషయంపై నిర్ధారణకు వచ్చే ముందు ఆ విషయాన్ని చెప్పే ముందు ముందూ వెనకా చూసుకునేవాడు కాదు. అలా అనవ సరమైన గందరగోళాల్లో దిగిపోయాడు.

"ఆవేశ పూరితమైన మనస్తత్వం వల్ల చాల ఉద్యోగాలు పోగొట్టుకున్నాడు. అతన్ని చూస్తే మానవ సంబంధాలున్న మనిషేనా అనిపిస్తుంది. కాని చాల మంచి మానవ సంబంధాలున్న మనిషి ఆయన".

"సమాచార సేకరణలో మన పరిశోధకుల్లో ఎవరూ అతన్ని మించిన వారు లేరు".

"ఆయన జ్ఞాపకార్థం ఆయన పుస్తకాలు పునర్ముద్రణ వేయడం బాగుంటుంది"

— అత్తలూరి నరసింహారావు (విశాఖ)

"నెల్లూరు మండల సర్వస్వం తయారు చేసేటప్పుడు బంగోరె ఎన్నో విషయాలు పట్టుకొచ్చేవాడు. వాటి ఆధారాలు చెప్పేవాడు. చాల మంది Sources చెప్పరు- అది ఆయనకు కోపం. ఎక్కువగా నిడదవోలు వెంకటరావు మీద మండిపడేవాడు.

"బి.కామ్ (ఆనర్స్) చదివి తిరిగి వచ్చిన తర్వాత అన్నలు, చదువుకే ఖర్చయింది. నీకు వచ్చే ఆస్తి లేదు అన్నప్పుడు- ఎలుకల మందు తిన్నాడు. అది పాత మందు ఎప్పటిదో కనుక చనిపోలేదు".

— ఎస్. ఎస్. కృష్ణమూర్తి (నెల్లూరు)

"బంగోరె చాల నిక్కచ్చి మనిషి. Conseqvences ఏమిటి అని ఆలోచించేవాడు కాదు. ఫలనా వాడు దుర్మార్గుడు, రౌడీ అనుకుంటే మనం జాగ్రత్తగా వుంటాం. బంగోరె అలాకాదు, వాడిని పట్టుకొని వాడి ముఖం మీదే నీవు రౌడీవి, దుర్మార్గుడివి అనేస్తాడు. ఈనాటి సమాజపు పోకడలలో ఇలాంటి వ్యక్తి ఎలా ఇమడగలడు?.... రాజీ ధోరణి లేదు. ఉద్యోగం చేసేటప్పుడు తన కంటే పై అధికార్లను ఏ మాత్రం లక్ష్య పెట్టలేదు".

"ఎప్పుడైతే ఒక వ్యక్తి Non-Compromising ధైర్యంలో వుంటాడో, మనం ఏమీ చేయలేక పోతున్నామే, అన్న దానిపై frustration రావడానికి అవకాశం వుంది. ఇక ఆ తర్వాత నేను సమాజానికి ఏమీ సేవ చేయలేక పోతున్నాననే భావన వచ్చి వుండవచ్చు".

— వేదం వెంకట్రామన్

---

## బంగోరె అత్తలూరికి రాసిన ఉత్తరం

బంగోరె
21-10-82

3/72 జర్నలిస్టుకాలనీ
ఎ.కె. నగర్ నెల్లూరు-4

డియర్ అత్తలూరి-

నీ జాబులన్నీ చేరుతున్నాయి. రాయడానికేముంది- మనను నిరామయంగా వుంటున్నది. నీవన్నట్లు విరక్తి యోగంలో వున్నాడు బంగోరె.

బంగోరె సూర్యుడు అస్తమించబోతున్నాడు. లేదా బంగోరె లోని సూర్యుడు అస్తమించబోతున్నాడు. నాలో జర్నలిస్టు పోయాడు- పరిశోధకుడూ లుప్తమై పోయినట్లే. యిక మిగిలున్నది పొట్టి కట్టె మాత్రమే. →

సినిమా సమీక్ష :

# సినిమాగా, పుస్తకంగా విశ్వజనీనమై విశ్వవ్యాప్తమైన జీవనేతి హాసం "పదిహేనేళ్ళమ్మాయి డైరీ"

—బంగోరె

ఈ సినిమా వస్తే చూడండి. మీరా నాడు ఆ వ్యాసం వ్రాయకుండా వుంటే, నేనీనాడిక్కడ ఈ సినిమా చూచివుండే వాణ్ణి కాదేమో అని ఈ మధ్య అమెరికా నుంచి ఒక మిత్రుడు ఉత్తరం వ్రాశారు. చాలారోజుల క్రిందట, పదిహేనేళ్ళ అమ్మాయి 'అన్నీ ఫ్రాంక్' వ్రాసిన డైరీని చదివింతర్వాత "నేను నీ పుస్తకం చదివానమ్మా" అనే ఒక చిన్న వ్యాసం వ్రాశాను.

నిజానికి ఆ అమ్మాయి డైరీ చాలా విచిత్రమైంది. రచన పేరుతో వ్రాయక పోయినా, కవిత్వం పేరుతోగాక పోయినా, ఆ డైరీ ఒక్కటిచాలు— ఆ అమ్మాయిని గొప్ప రచయిత్రిగా పరిగణించేందుకు ఒక మహారచయిత కిచ్చే ఓటు ఆ అమ్మాయికి యివ్వకుండా వుండలేము.

'అన్నీ ఫ్రాంక్' 1944 డిసెంబరులో మరణించింది. అప్పటికి ఆమెకు 15 ఏండ్ల లేత్రాయమే. కాని ఆమె డైరీకి మరణమంటూ లేదనే చెప్పాలి. ఇంగ్లీషు, డచ్, జర్మన్, ఫ్రెంచి, ఇటలీ, నార్వేజియన్, జపాన్. మొదలగు ఇరవై ప్రపంచ భాషల లోకి అనువదించబడింది ఈ డైరీ. ఇద్దరు మహా రచయితలు ఈ డైరీని ఒక నాటకంగా వ్రాశారు. ఆ నాటకం అమెరికన్ పులిట్జర్ బహుమానాన్ని గూడా

---

← నిరసన చేరింది. నాకేమీ నచ్చలేదు. format బొత్తిగా- అందరూ సులభంగా పసికట్టేట్లు- ప్రస్తుతం నేనున్న Moodలో యేదీ నచ్చదు మరి. కాబట్టి నా మాట కేమి Value లేనట్లే అనుకో. జపిన్ రైతులో 'సూడో ప్రోగ్రసివ్' రాత చూశావు గదూ. ఆశ్చర్యం గల్గింది- యింత దూరాన యిటువంటి ప్రతిధ్వని కల్గించినందుకు-

పద్మని మరీ మరీ జ్ఞాపకం వస్తున్నది. కిందటి నెలలో రేడియో ప్రోగ్రాం Ist half విని ఆనందించాను- ప్రత్యేకించి అఖరు కీర్తన. కవిత్వం నచ్చక సంగీతం నచ్చిందంటే అది వేరే విషయం అనుకో-

మన వాళ్ళందరికీ నా జ్ఞాపకాలందజేయి-

మరి శలవా ?

బంగోరె

పొందింది. ఒక పాశ్చాత్య రచయిత ఎంతో పరిశోధనజేసి, దేశాలు తిరిగి, ఆ పది హేనేళ్ళ జీవిత విశేషాలను సేకరించి "Anne Frank, A Porthait in coulage" "అన్నీఫ్రాంక్ ఒక ధీరోదాత్తమైన చిత్రణ" అని ఒక జీవిత గ్రంథాన్ని ప్రచురించాడు. 20th Century Fox వారు, 1960లో అనుకుంటాను—ఈ డైరీని సినిమా స్కోప్‌లో చలన చిత్రంగా తీశారు. నిజానికి మరణించిన తర్వాతనే జీవిస్తున్న మహావ్యక్తి 'అన్నీఫ్రాంక్'.

ఇంతకూ ఎవరీ 15 ఏండ్ల అమ్మాయి 'అన్నీఫ్రాంక్'? ఏమిటి ఆమె డైరీలోని విశ్వజనీనమైన విశేషాలు అంటారేమో! నిజం చెప్పాలంటే సిరాతో వ్రాసిన డైరీ కాదది, లేత్రాయపు గుండె నుండి నేరుగా దూసుకొచ్చిన జీవజలతో తడిపి వ్రాసిన గ్రంథం. జీవిత సంఘర్షణను మనోజ్ఞంగా వినిపించిన, కాదు గానం చేసిన డైరీ అది. అమాయకమైన వాత్సల్యం, పసితనపు ఆవేదన, ఈ బ్రతుకులో ఆమె పొందిన నిర్వేదం, ఈ మానవత్వం మీద ఆమెకున్న ప్రగాఢమైన అచంచల విశ్వాసం; ఈ మనుషుల మధ్య బ్రతకలేక, తన చిన్న చిన్న విశ్వాసాలను వారితో పంచుకోలేక తహ తహ లాడిపోయిన ఈ చిన్నారి హృదయం మనకు ఆ డైరీలో విన్పిస్తుంది, కన్పిస్తుంది.

యుద్ధోన్మాది, ఛండశాసనుడైన హిట్లర్ హయాంలో అన్నీఫ్రాంక్ కుటుంబం, మిత్రులు రహస్యంగా, అతి రహస్యంగా ఒక చీకటి కొంపలో తల దాచుకోవలసిన దారుణమైన పరిస్థితుల్లో ఈ డైరీ పుట్టింది. రాత్రిళ్ళు, రాత్రిళ్ళు ఈ పసి అమ్మాయి ఆ చీకటి గదిలో, గుడ్డి దీపం ముందు కూర్చొని, స్వచ్ఛమైన స్నేహం దొరక్క, ఆమె ఏర్పరచుకున్న అజ్ఞాత స్నేహితుడు 'కిట్టీ'ని పంబోదిస్తూ, ఏకాంతంలో పరితపిస్తూ వ్రాసిన డైరీ యిది. బూట్ల చప్పుడు విన్పించినా, శారు హారను మ్రోగినా, రోడ్డుమీద రొదచెవిన బడినా— ఎక్కడ చిక్కిపోతామేమో ననే భయాందోళనల్లో పడిపోయే ఆ ప్రమాద క్షణాలను ఎంతో పటుత్వంగా చిత్రించింది— ఆ చిన్నారి కలం. ఈ ఒక్క దుర్భరమైన నిశ్శబ్దంతోనే రస నిరూపణ చేసిన ఆమె సహజమైన శిల్ప చతురిమ ఏ రచయితకైనా ఆదర్శప్రాయమైంది.

ఈ డైరీలో మన కింకా ఏం కన్పిస్తాయి?....తన తండ్రి మీద ఆమెకున్న నిర్మలమైన విశ్వాసం, తల్లి తన భావాలను అర్థం చేసుకోలేపోయినదనే ఆవేదన, తన జాతి జనులు, నాజీక్రూర ప్రభుత్వ కబంధ హస్తాల్లో ఇరుక్కుపోయి ప్రాణాలు కోల్పోయారని తెల్సి- విల విల లాడిపోయిన ఆక్రందన, సహచరులకు, స్నేహితురాండ్రకు దూరమైపోయానని అనుభవించిన ఆరాటం, తమ ఆ రహస్య గృహంలో తన మిత్రుడు- 17 ఏండ్ల మిత్రుడు- మీద ఆమె ఏర్పరచుకొన్న నిష్కళంకమైన ప్రేమాతిశయము, ఆ మిత్రుడు మొదటిసారిగా తన చెక్కిళ్ళు ముద్దాడినప్పుడు ఆమె

పొందిన స్వచ్ఛమైన పారవశ్యం, త్వరగా పెద్దదాన్నయి ఈ ప్రపంచ వ్యూహంలో ధైర్యంగా పోరాడాలని, ఈ జీవిత సమరంలో పాల్గొనాలని ఆమె పడ్డ తహ తహ: ఈ ప్రపంచం కళ్ళు తెరవాలనే ఆశయంతో అప్పటిదాక వ్రాసిన ఆ డైరీ పేజీలను ఆధారం చేసుకొని పెద్ద గ్రంథం వ్రాయాలనే చిన్ననాటి కలలు; స్వేచ్ఛకోసం, మంచితనం కోసం, కుటిలత్వ మెరుగని కమనీయ జీవిత పరిసరాల కోసం ఆమెపడ్డ ఆత్మవేదన - ఇలా వేయిరేకులతో వికసిస్తున్న వ్యక్తిత్వ వైభవ మంతా మన కళ్ళ యెదుట సాక్షాత్కరిస్తుంది ఈ డైరీలో. ఇంత పసి గొంతుకలో ఇంత పరిపక్వమైన జీవిత ధ్వని వినిపిస్తున్నందువల్లనే ఆ డైరీ చదివిం తర్వాత- ఆమెకు నివాళులర్పించకుండా వుండలేం.

నాజీసోల్జర్లు, పోలీసులు, ప్రభుత్వ అకృత్యాలు, కాల్పులు, యుద్ధాలు ఘోరాల మధ్య కొందరు అమాయకమైన, గోవుల్లాంటి జీవుల భయాందోళనలు వ్యక్తం జేస్తుంది ఈ డైరీ. ఆ రాక్షస కృత్యాలకు, పైశాచిక చర్యలకు ఆత్మసాక్షిగా ఈ డైరీ నిల్చి వుంది. హిట్లరు అనుచరులు, నాజీలు పరాజితులయ్యారు. కాని ఈ డైరీ మాత్రం విజయాన్ని పొందింది. ఈ డైరీని నాటకంగా వ్రాసినపుడు చూసి, సినిమాగా చూసినప్పుడు సందర్శించి, జర్మన్లు — "ఒకప్పుడు మా దేశాన్ని ఇంత పైశాచికమైన ప్రభుత్వం పరిపాలించిందా ?" అని సిగ్గుపడ్డారు, తమంత తామే అసహ్యించుకున్నారు. ఇంతకంటే ఏ పుస్తకమైనా సాధించ గలిగిన ఆదర్శం ఏముంటుంది.

ఈ డైరీ ఆధారంగా తీసిన సినిమాలో అన్నీఫ్రాంక్ పాత్రను "మిల్లీ పెర్కిన్స్" నటించింది. అంతర్జాతీయ సినిమా పోటీల్లో నాలుగు ఆస్కార్ అవార్డులు పొందిన చలన చిత్రమది. ఆ మధ్య మద్రాసు, బొంబాయి నగరాల్లో విడుదలైంది. త్వరలోనే మన ప్రాంతాలకు గూడా రావచ్చు. వస్తే మాత్రం "మిస్" చేయవద్దు. చూసి తరించండి.

(జమీన్‌రైతు 28-2-64 సౌజన్యంతో)

## బంగోరె జీవిత విశేషాలు

| | |
|---|---|
| పుట్టుక : నెల్లూరు జిల్లా, కోవూరు తాలూకా మినగల్లులో | — 12-10-1938 |
| చదువు } బి.కాం (ఆనర్స్), డిప్లమా ఇన్ కో ఆపరేషన్ | |
| సంధ్యలు } 'స్రవంతి' పత్రికా నిర్వహణ, ఇతర కార్యకలాపాలు | — 1954-1960 |
| ఆంధ్రజ్యోతి : | — 1960 |
| కో ఆపరేటివ్ బ్యాంకి ఉద్యోగం | — 1961-63 |

'శ్రీవిక్రమపురి సర్వస్వ గ్రంథ మండలము' సహాయ సంపాదకత్వం — 1963
'జమీన్ రైతు' ఉపసంపాదకత్వం, 'కూనిరాగాలు' శీర్షిక నిర్వహణ — 1964-'69
సుమిత్రతో పెళ్ళి — 1966
పెద్దబ్బాయి సుధీర్ పుట్టుక — 1967
తొలి కన్యాశుల్కం ఫుట్‌నోట్స్‌తో ప్రచురణ — 1969
'చంద్రిక కథ' అనువాదం, జమీన్ రైతులో ప్రచురణ — 1969
చిన్నబ్బాయి సాగర్ పుట్టుక — 1969
స్పీచెస్ అండ్ ఎస్సేస్ ఆఫ్ డా॥ సి.ఆర్. రెడ్డికి సహ సంపాదకత్వం — 1970
'చంద్రిక కథ' ప్రచురణ — 1971
మద్రాసు అమెరికన్ సమాచారశాఖ వుద్యోగం — 1971-72
పఠాభి 'ఫిడేలు రాగాలడజన్' పునర్ముద్రణ బాధ్యత — 1973
బ్రౌన్ జాబులు- తెలుగు జర్నలిజం చరిత్ర- కూర్పు, ప్రచురణ — 1973
తాతాచార్యుల కథలు- ఎమెస్కో ప్రచురణ — 19'4
'యూత్ కాంగ్రెస్' సంపాదకత్వం — 1974-75
డా॥ జె. మంగమ్మ పరిశోధక గ్రంథం- బంగోరె ప్రచురణ
(బుక్ ప్రింటింగ్ ఇన్ ఇండియా) — 1975
వెంకటేశ్వర యూనివర్శిటీలో బ్రౌన్ ప్రాజెక్టు రీసెర్చి ఆఫీసర్ — 1975-78
బ్రౌన్ జాబులు, ఆధునికాంధ్ర సాహిత్య శకలాలు — ఫిబ్రవరి '77
'ఆంధ్ర గీర్వాణచ్ఛందము' ప్రచురణ — మార్చి '77
బ్రౌన్ జాబుల్లో స్థానిక చరిత్ర శకలాలు : కడపజాబుల
సంకలనం — డిశంబరు '77
'మాలపల్లి నవలపై ప్రభుత్వ నిషేధాలుపై పరిశోధన'
స్వంత ప్రచురణ — 1978-79
హైద్రాబాదు, యోగివేమన విజ్ఞాన కేంద్రం రీసెర్చి ఆఫీసరు — 1980-81
'వేమన పద్యాలు- బ్రౌన్ 1839 నాటి సంకలనం' ప్రచురణ — 1980
వాల్తేరు, సి.ఆర్. రెడ్డి రీసెర్చి కేంద్రంలో రీసెర్చి ఆఫీసరు — 1981-82
'వేమన— సి.ఆర్. రెడ్డి' ప్రచురణ — 1981
బంగోరె మృతి — 1982

(8వ పేజీ తరువాయి)

కొనసాగుతూ వచ్చింది. Contemporary relevance లేకుండా చరిత్ర రచన సాగింది." అంటారు బంగోరె [illegible].

ఈ వ్యాసంలో [illegible] కోస్తా ప్రాంతంలో 1787, 1839 [illegible] వచ్చిన [illegible] తుపానుల గురించి నాటి బ్రిటిష్ ప్రభుత్వం, ప్రజలూ ఎదుర్కొన్న తీరూ, మన స్వతంత్ర ప్రభుత్వం ఈనాడు వ్యవహరించిన తీరూ, నాటి ప్రభుత్వానికీ, ఈనాడు ఏర్పడియున్న ప్రభుత్వానికి తేడా వుందా అన్న applied ధోరణిలో చరిత్రను బంగోరె అందించారు. అలాగే నెలక్రితం మహారాష్ట్రలో వచ్చిన భూకంపం సందర్భంలో గతంలో దేశంలో, విదేశాల్లో వచ్చిన భూకంపాలు- భూకంపం రాబోయే ముందు ప్రమాద సూచన తీయడం, వచ్చిన తర్వాత పునరావాస కార్యక్రమాల కల్పన మొదలైన విషయాలు- గత చరిత్ర నుంచి గుణపాఠాలు నేర్చుకోవడం ముఖ్యం. దాదాపు పది, పదిహేనేళ్ళ క్రితం చైనాలో వచ్చిన దారుణమైన భూకంపం-అక్కడి ప్రభుత్వం భూకంప బాధితులకు ఒకటి, రెండు రోజుల్లోనే నిత్యావసర వస్తువులనూ, గుడారాలనూ ఏర్పాటు చేయడం గురించి మనం ఆనాడు విస్తారంగా చెప్పుకున్నాం. వాటి ఆధారంగా మన ప్రభుత్వం గుణపాఠాలేమైనా నేర్చుకుందా? శాస్త్రీయమైన, సంప్రదాయకమైన పద్ధతుల ద్వారా భూమి కంపనల గురించి ముందు హెచ్చరించలేకపోవడం ప్రభుత్వం యొక్క దివాళాకోరుతనమే కారణం.

ఈ విధంగా, 'వర్తమానాన్ని, భవిష్యత్తుని అర్థం చేసుకునే సాధనంగా, అన్వయించుకునే ఆయుధంగా మన చరిత్రను మనం యేనాడూ వినియోగించుకోలేదు.... చరిత్ర అనేది ఒక ప్రాణప్రదమైన నవనవోన్మేషమైన విజ్ఞానశాఖగా మన గడ్డ మీద వర్థిల్లనూలేదు....మన దృష్టిని మార్చవలసిన చరిత్ర మన కొత్త దృష్టిని ప్రసాదించవలసిన చరిత్ర రచనలు చాలా రావలసి వున్నాయి'.

బి.కామ్. (ఆనర్స్) డిగ్రీ పొందే నాటికే, జర్నలిజంలో నైపుణ్యం సంపాదించిన బంగోరె నెల్లూరు పత్రిక 'జమీన్ రైతు'లో 1965-1971 సంవత్సరాల్లో పనిచేశారు. 1971లో మద్రాసులోని అమెరికా సమాచార శాఖలో పని చేసారు. ఆ తర్వాత 'యూత్ కాంగ్రెస్' (నెల్లూరు) పత్రికలో సంపాదకునిగా పని చేశారు. ఈ సంపాదకత్వ జీవితం ఒక ఎత్తు కాగా, చరిత్ర పరిశోధకునిగా ఆయన జీవితం మరో ఎత్తు.

1969 [illegible] ప్రచురించిన గురజాడ "మొట్టమొదటి కన్యాశుల్కం" బంగోరె [illegible]. [illegible] రెండవ కన్యాశుల్కానికి గల తేడాలు, గురజాడ దృష్టిలో వచ్చిన మార్పులూ, పరిణతి

మొదలైన ఎన్నో విషయాలు తులనాత్మకంగా పరిశీలించాడు. ఆ నాటకంలో ప్రస్తావించబడిన వివిధ విషయాలపై వివరణలూ, వ్యాఖ్యానాలూ, భాషకూ, జాతీయాలకూ, నుడికారాలకూ, మాండలిక పదాలకూ, సామెతలకూ సంబంధించిన వివరణలు చాలవరకు సమగ్రంగా పొందుపరిచాడు బంగోరె. ఈ వివరణలు 'కన్యాశుల్కం' నాటకంలోని ప్రతి వాక్యాన్నీ అర్థం చేసుకోవడానికి ఎంతగానో ఉపయోగపడ్డాయి.

1971 ఏప్రిల్‌లో ప్రచురించిన 'చంద్రిక కథ'- తమిళం నుంచి అనువాదం. తమిళ జాతీయ మహాకవి సుబ్రహ్మణ్య భారతి, తమిళంలో కందుకూరి వీరేశలింగం గారి జీవితాన్ని ఈ నవలలో రాశాడు."సమకాలిక వ్యక్తులకుగాదు-సమకాలిక సమస్యలకు కూడా మన సాహిత్యం దూరంగా వుంటూ వచ్చింది. అట్లాంటి దశలో వీరేశలింగం వంటి తెలుగు మహాపురుషుడు, తమిళ జాతీయ కవిగా ప్రఖ్యాతుడయిన సుబ్రహ్మణ్యభారతిగారి నవలకు కథా వస్తువు గావడమే ఒక విచిత్రమైన సంగతి కదా- ఈ ఒక్క గుణం వల్లనే 'చంద్రిక కథకు మన 'దేశవాళీ' నవలల్లో ఒక పత్యేక స్థానం వుంది.

ఇంతకీ బంగోరెకి ఈ నవల గురించి ఎలా తెలిసింది? నార్ల ఇంగ్లీషులో వీరేశలింగంపై రాసిన పుస్తకాన్ని 'స్వరాజ్య' అనే ఇంగ్లీషు పత్రికలో సమీక్షిస్తూ శ్రీమతి ప్రేమా నందకుమార్,వీరేశలింగం, ఆయన భార్య పాత్రలుగా సుబ్రహ్మణ్య భారతి రాసిన అసంపూర్ణ నవల 'చంద్రిక కథ' గురించి ప్రస్తావించారు. అది చదివిన బంగోరె డొంకంతా లాగి ఆ తమిళ అసంపూర్ణ నవలను తానూ, ఎస్. ఎస్. కృష్ణమూర్తి, ఎ.ఎస్. రాఘవన్‌లు అనువదించారు.

బ్రౌన్ ప్రాజెక్టులో పనిచేసిన బంగోరె 1974 జులైలో సి.పి. బ్రౌన్ సేకరించిన 23 తాతాచార్ల కథలను ఎమెస్కో వారి చేత ప్రచురింపచేసాడు. ఈ కథలు అప్పటి (1855) గ్రామీణ వ్యవస్థ, వ్యవసాయ వ్యవస్థ పనిచేసే తీరును గురించి కొంత వెలుగును ప్రసరింప చేస్తాయి. వ్యవహారిక భాషావాదానికి బ్రౌన్ ఒక విధంగా వైతాళికుడని ఆఖరు దశలో గురజాడ గుర్తించి నందున ఈ తాతాచార్ల కథలకు సంపాదకత్వం వహించి వుండవచ్చు. 1915లో గురజాడ మరణించిన తర్వాత ఈ పుస్తకాన్ని వావిళ్ళవారు 1916లో ప్రచురించారు. బ్రౌన్ ఈ కథల్లోని, భాషా సారళ్యమూ, సూటిదనమూ, వీటితోని చరిత్రంశాలు వున్నాయన్న స్పృహతో వీటిని సేకరించి ప్రచురించాడు.

ఇక బ్రౌన్ ప్రాజెక్టు క్రింద బంగోరె విజృంభించి, 1977 డిసెంబరులో "బ్రౌన్ జాబుల్లో స్థానిక చరిత్ర శకలాలు-కడప జిల్లా" అనే పుస్తకాన్ని ప్రచురించారు. 'కడప మండల స్థానిక చరిత్రవగాహనకు, తెలుగు భాషా పరిణామ చరిత్రకూ మిక్కిలి ఉపకరించే ఉత్తరాలు ఈ సంకలనంలో వున్నాయి. వచన రూపంలో

మనకు లభ్యమైన తొలి తెలుగు లేఖలు బ్రౌన్ సేకరించినవే. 19వ శతాబ్దంలోని తెలుగు భాషా స్వరూప లక్షణాలు, సంప్రదాయ విశేషాలు వీటి ద్వారా తెలుస్తాయి. ఇవేగాక బంగోరె "బ్రౌన్ లేఖలు: ఆధునికాంధ్ర సాహిత్య చరిత్ర శకలాలు", "బ్రౌన్ జాబులు, తెలుగు జర్నలిజం చరిత్ర 1832-1857" కూడా ప్రచురించాడు.

1979 ఏప్రిల్‌లో ప్రచురించిన 'మాలపల్లి నవలపై ప్రభుత్వ నిషేధాలు'కు ముందు మాటలు రాస్తూ "మార్క్స్ బోధించిన 'చారిత్రక దృష్టి' మనలో త్వరగా పిల్లెత్తుకు పోతున్నదా అన్పించింది." అని బంగోరె నిశితంగా విమర్శించాడు. మాలపల్లి "ప్రజాతంత్ర దృష్టితో నిష్టగా వాడుక భాషలో వ్రాయబడిన నవల...." అనీ, 'కమ్యూనిస్టుపార్టీ అనేది తెలుగునాట అవతరించక ముందే మార్క్సిస్టు భావ ప్రేరణకు నాంది పలికిన తొలి సృజనాత్మక రచనగా మాలపల్లిని పేర్కొనవలసి వుంటుంది' అనీ, బంగోరె సరిగ్గా వ్యాఖ్యానించాడు.

'మాలపల్లి'పై నిషేధాలు, ఇతర సాహిత్యంపై బ్రిటీషువారి నిరంతర నిషేధ పరంపరకు సంబంధించిన విలువైన సమాచారాన్ని ఈ పుస్తకంలో బంగోరె ఇచ్చారు.

యోగివేమన తెలుగు విజ్ఞాన కేంద్రం తరపున 1980 జులైలో సి.పి. బ్రౌన్ 1839లో ప్రచురించిన వేమన పద్యాలు సంకలనం బంగోరె సంపాదకత్వాన పునః ప్రచురించారు. వేమనను నిర్లక్ష్యం చేసిన సాహిత్య చరిత్రకారుల గురించి వివరించారు. గురజాడ శ్రీరామమూర్తి రాసిన 'ఆంధ్ర కవుల జీవితము'లో వేమన లేడు. కందుకూరి వీరేశలింగం రచన 1899 ఎడిషన్లో, 1917 ద్వితీయ ముద్రణ 'ఆంధ్ర కవుల చరిత్రము'లో వున్న 220 మందిలో వేమన లేడు. 1829లో కావలి వీరాస్వామి ఇంగ్లీషులో ప్రచురించిన 'దక్కన్ కవుల జీవితాలు'లో వున్న 108 మందిలో 44 మంది తెలుగు కవులు కాగా, వారిలో వేమన లేడు.

1914లో సి.ఆర్. రెడ్డిగారు తన కవిత్వతత్వంవిచారం లో మొట్టమొదట వేమనకు మహాకవి పీఠం ఇచ్చారు.

కాని 1899లోనే మద్రాసు కాలేజి తరపున ఇంగ్లీషు-తెలుగులో సి.పి. బ్రౌన్ వేమన పద్యాలు క్రోడీకరించి 500 కాపీలు ముద్రించారు. బ్రౌన్‌కు 50 కాపీలు ఇచ్చారు. మిగిలిన కాపీలు మార్కెట్లోకి వెళ్ళకుండా మాయమైపోయాయి. ఆ తర్వాత పదేళ్ళకు బ్రౌన్‌కు తెలిసిందీ-ఆ కాపీలను కాలేజి బోర్డులో వుండే సనాతన పండితులు పనికిరాని కాగితాలు, పుస్తకాలు క్రింద, స్టోర్‌రూమ్‌లో పడేశారు. పాఠ్య పుస్తకాలలో వేమన పద్యాలు చేరిస్తే, వాటిని చెప్పకుండా అయ్యవార్లు దాట వేసేవారు. ప్రాచీన కాలంలో లోకాయత, చార్వాకుల గ్రంథాలను బయటకు రానీయకుండా ధ్వంసం చేసిన వారి జీవ లక్షణమూ, ఈ సనాతన పండితుల జీవలక్షణమూ ఒకటే....

౧౯౮౦. పట్టి తెలుగు అకాడమీ కమిటీ బంగోరె రచించిన 'వేమన- సి.ఆర్. రెడ్డి', అనే గ్రంథాన్ని 1981 డిసెంబర్ 10న ప్రచురించింది. 1928లో ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు అనంతపురంలో సి.ఆర్.రెడ్డి గారిచేత ఇప్పించిన వేమనపై ఉపన్యాసాల నేపథ్యాన్ని వివరిస్తూ, వేమన గురించి కట్టమంచి రామలింగారెడ్డి కృషిని, గాసిప్ సంకలించిన రచన ఇది. "తెలుగు పండిత లోకం వేమన గురించి నోరు కట్టేసినట్టు ఒకరకమైన మూగతనం వహించిన దశలో, ఆయన్నూ, ఆయన కవిత్వాన్నీ, సందేశాన్ని గుర్తించి, అభిమానించే వర్గం ఒకటి ఆవిర్భవించడానికి తోడ్పడిన Sociology ని, ఆ క్రమంలో ఉత్పన్నమైన సాంఘిక, సాహిత్య శక్తులను పరిశీలించడానికి ప్రయత్నం చేసింది బంగోరె పుస్తకం.

తెలుగు భాషను ఇంకా సరళం చేయడానికి కూడా బంగోరె ఆలోచించాడు. ఒకచోట అంటాడు గదా- ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ,అనే పన్నెండు అచ్చులనూ తొలగించి వాటి స్థానంలో యి, యీ, వు, వూ, రు, రూ, యె, యే, అయి, వొ, వో, అవు వుపయోగిస్తే కొంప మునిగి పోతుందా అని ప్రశ్నించాడు.

1936లో జన్మించిన బంగోరె, తెలుగు సాహిత్య చరిత్ర పరిశోధకునిగా, అనన్య సామాన్యమైన కృషి జరిపి, ప్రగతి శీల సాహిత్య పునాదులకు అవసరమైన రకరకాల సాహిత్య గ్రంథాల పరిశీలన మనకందించి, ఆయన వ్యక్తిత్వంలో మొదటి నుంచీ కొనసాగిన నిరాశతో 1982 అక్టోబర్ 31న, భాక్రా-నంగల్ వద్ద సట్లెజ్ నదిలో దూకి ఆత్మహత్య చేసుకున్నాడు. ●

## కథా రచయిత చక్రవేణు మృతికి సంతాపం

అలిశెట్టి ప్రభాకర్, సాహుల ఆకస్మిక మరణం సృష్టించిన విషాదం నుంచి తేరుకోక మునుపే కథా రచయిత చక్రవేణు 15-9-93న ప్రమాదంలో మరణించారన్న వార్త దిగ్భ్రాంతిని కలుగ చేసింది. 'కువాయిట్ సావిత్రమ్మ' కథ ద్వారా తెలుగు కథా ప్రపంచంలో ప్రవేశించి, మంచి కథకునిగా ఎదుగుతున్న దశలో చక్రవేణు మరణించడం తెలుగు కథా సాహిత్యానికి తీరనిలోటు. ఈ సందర్భంగా వారి బంధుమిత్రుల, కుటుంబ సభ్యుల దుఃఖంలో పాలుపంచుకుంటూ చక్రవేణు మృతిపట్ల జనసాహితి తన ప్రగాఢ సంతాపాన్ని తెలియ చేస్తోంది.

కొత్తపల్లి రవిబాబు

నగరం ప్రధాన కార్యదర్శి

20-9-1993 జనసాహితి (విప్లవ సాహిత్య సంస్థ)

(7వ పేజీ తరువాయి)

కాశ్మీరీలు హిందువులైనా- ముస్లింలైనా తామంతా 5000 సం॥ల సుదీర్ఘ చరిత్ర గలిగిన ప్రత్యేక జాతిగా జె.కె.ఎల్.ఎఫ్. ప్రకటిస్తుంటే బి.జె.పి. లాంటి హిందూ మతోన్మాద సంస్థలు, కొన్ని ముస్లిం సంస్థలు - హిందూ ముస్లింలుగా ప్రజలను చీల్చాలని చూస్తున్నాయి బి.జె.పి. వారు "కాశ్మీర్‌లో హిందూ దేవాలయాలపై దాడులు" అని పెట్టిన గగ్గోలు- "ఇండియా టుడే" వారి పరిశోధనలో పటాపంచలై పోయింది.

ప్రజాస్వామిక- సెక్యులర్ దృక్పథం గలవారే జాతుల పోరాటాన్ని కూడా విజయవంతంగా నడప గలుగుతారు. సామ్రాజ్యవాదుల ప్రాంతీయ పెత్తందార్ల కుట్రలను కూడా ఓడించగలుగుతారు. కాశ్మీర్ జాతీయ పోరాటం విజయం సాధించాలనీ, సామ్రాజ్యవాదుల కుట్రలకు తావివ్వని స్వయం నిర్ణయాధికార ప్రభుత్వాన్ని నెలకొల్పుకోవాలనీ, భారత ఉపఖండంలోని ఫ్యూడల్- సామ్రాజ్యవాద వ్యతిరేక, జాతుల పోరాటానికి ప్రేరణగా నిలవాలనీ 'ప్రజాసాహితి' కోరుకుంటోంది. త్యాగపూరితమైన వారి సుదీర్ఘ పోరాటానికి జేజేలు పలుకుతోంది. లౌకిక, ప్రజాస్వామిక శక్తులన్నీ వారిని బలపరచాలని కోరుతున్నాము.

భారత పాలకులు కాశ్మీరులో నిరంకుశ విధానాలకు స్వస్తి చెప్పి మిలటరీని వెనక్కి తెప్పించుకుని, 1952 నాటి ఢిల్లీ ఒడంబడికను అమలు జర్పాలని డిమాండ్ చేస్తున్నాం.

20-4-1964 న జయప్రకాశ్ నారాయణ్ 'హిందూస్థాన్ టైమ్స్'లో కాశ్మీర్ గురించి రాసిన వ్యాసంలోని కొద్దిమాటలతో దీన్ని ముగిస్తాము.

"చివరగా, (విలీన మనేది) ఖచ్చితమైన ప్రజల తీర్పుగా భావించితే, వారికి దాన్ని మరొకసారి తెలియపర్చే అవకాశం యివ్వటాన్ని మనమెందుకు వ్యతిరేకిస్తున్నాం? దీనికి యిస్తున్న జవాబేమిటంటే యిది దేశాన్ని విచ్ఛిన్నంచేసే ప్రక్రియకు దారితీస్తుందని. ఇంతకంటె తెలివి తక్కువ అంశాలు ఈ వివాదంలో చోటుచేసుకున్నాయి. ఈ వాదన వెనకగల భావన ఏమిటంటే భారతదేశంలోని రాష్ట్రాలు బలవంతంగా కలుపబడినాయేగానీ ఒకే ఉమ్మడి జాతీయ భావోద్వేగంతో లేవు. ఇది భారత జాతీయత అనే భావనను హాస్యాస్పదంగానూ, భారత రాజ్యాంగాన్ని నిరంకుశమైనదిగానూ చేస్తుంది."

ప్రజాసాహితి

# భూకంపాలు ఎలా వస్తాయి

— సుమతి

భూమి స్వరూప స్వభావాల గురించి బాగా తెలుసుకుంటే తప్ప భూకంపాలు ఎందుకు, ఎలా సంభవిస్తాయి అని స్పష్టమైన అవగాహన కలగదు. భూమి అంటే సాధారణంగా మన దృష్టిలోకి వచ్చేదానిపైన వున్న చెట్లు, చేమలు, నదులు, సరస్సులు. భూగర్భం గురించి, అందులో ఏమి ఉందో అనే దాని గురించి ప్రజలు ఆలోచించరు. అందుచేతనే భూకంపం రాగానే ఆ ప్రకంపనాలకు ప్రజలు ఒణికి పోతారు.

భూమి స్వరూప స్వభావాల గురించి మనకి పూర్తిగా మనకి తెలియకపోయి నప్పటికి గత 100 సంవత్సరాలలో జరిగిన ఎన్నో పరిశోధనల వల్ల భూ భౌతికస్థితి గతుల గురించి శాస్త్రజ్ఞులు కొన్ని అంచనాలు వేయగలుగుతున్నారు. ఈ వ్యాసంలో భూగర్భ స్వరూప స్వభావాల గురించి మనం తెలుసుకుందాం.

## భూగర్భ స్వరూపం

భూమి వ్యాసం సుమారు 8వేల మైళ్ళు ఉంటుంది. మనం త్రవ్వకాల ద్వారా భూమి లోతులో 7 మైళ్ళ వరకు వెళ్ళగలిగాం. భూమి అంతర్భాగాన్ని శాస్త్రజ్ఞులు 3 భాగాలుగా విభజించారు పైన వుండే గట్టి పొరని "క్రస్ట్" అంటారు. ఇది 7 నుండి 30 మైళ్ళ మందం ఉంటుంది. సముద్రాల క్రింద అయితే ఈ క్రస్ట్ పలుచగా ఉంటుంది. అందుచేతనే శాస్త్రజ్ఞులు సముద్రాలలో లోతుగా త్రవ్వి భూమి గురించి ఎన్నో విశేషాలు తెలుసుకున్నారు, ఈ క్రస్ట్‌లో అనేక రకాల శిలలు, ఖనిజాలు, లవణాలు, పెట్రోలియం, భూగర్భజలం, వేడివాయువులు పొరలు పొరలుగా ఉంటాయి. దొంతరపెట్టిన ప్లేట్లలాగా కొన్నిచోట్ల ఒకదానిమీద ఒంటి, మరోచోట ప్రక్క ప్రక్కన ఉండి ఒక పొరతో మరొక పొర ఢీకొంటు తేలుతూ ఉంటాయి. శిలలలో ఒకే ఖనిజం ఉండవచ్చు. లేదా వివిధ ఖనిజాల సమ్మేళనం అయి వుండవచ్చు. సున్నపురాయి ఒకే ఖనిజాన్ని కలిగి ఉంటే, గ్రానైట్ రాయి అనేక రకాల శిలల మిశ్రమం.

## భూ గ ర్భ శి ల లు

రాతి పొరలను శాస్త్రజ్ఞులు 3 భాగాలుగా విభజించారు. వాటిని ఇగ్నిషియస్, సెడిమెంటరీ మెటామార్ఫిక్, శిలల పొరలు అంటారు.

ఇగ్నియస్ శిలలు భూగర్భంలో వేడిపదార్థం చల్లారడం వల్ల ఏర్పడ్డాయి. ఇవి ప్రాథమికమైన స్వాభావిక శిలలు. వీటినుండి ఇతర రకాల శిలలు తయారయినాయి. క్రస్ట్‌లో 95 శాతం ఇగ్నియస్ శిలలతో కూడుకుంది.

సెడిమెంటరీ శిలలు భూమి పొరల్లో ఉంటాయి. మట్టి, ఇసుక, గులకరాళ్ళు, గ్రావెల్ ఇవన్నీ నదులలో కొట్టుకు వచ్చి సముద్రం అడుగు భాగాన చేరతాయి. ఇవి భూమి పై భాగాన ఉంటాయి. క్రస్ట్‌లో 5 శాతం సెడిమెంటరీ శిలల పొరలు ఉంటాయి. ఈ పొరల మధ్యలోనే ఫాసిల్స్ అంటే మరణించినజీవరాసులు శరీర అచ్చులు ఏర్పడతాయి.

క్రస్ట్‌లో రెండువేల రకాలకి పైగా ఖనిజాలు ఉంటాయి. భూమిలో ప్రధానముగా ఎనిమిది రకాల మూలద్రవ్యాలు ఉన్నాయి. అవి ఆక్సిజన్, సిలికాన్, అల్యూమినియం, కాల్షియం, సోడియం, పొటాషియం, మెగ్నీషియం.

మాగ్మా చల్లారి క్రస్టుగా తయారవడంతో, చాలా లోహాలు విడిపోయి"ఓర్స్" అంటే ఖనిజ మూలాలుగా తయారవుతాయి. రాగి, బంగారం, ఇలా తయారయినవే. వజ్రం, వైఢూర్యం మొదలైన ఖనిజాలు కూడా భూమిలో తయారవుతాయి. బొగ్గు, పెట్రోలియం, నూనె వంటివి కూడా క్రస్టులో ఉంటాయి.

మూడవరకం మెటామార్ఫిక్ శిలలు. ఇవి ఇగ్నియస్, సెడిమెంటరీ శిలలలో మార్పులవల్ల తయారైనవి. పాలరాయి, పలకరాళ్ళు మెటామార్ఫిక్ శిలలే. భూమిపై పొర క్రింది బాగంలోని సున్నపురాళ్ళు అతివేడి, అతిపీడనం వల్ల పాలరాళ్ళుగా తయారవుతాయి.

## భూగర్భంలో పరిశోధన

1882 లో మొట్టమొదటి అంతర్జాతీయ ధృవసంవత్సరం నిర్వహించారు. ఆ సందర్భంగా ఆర్కిటిక్ వలయాన్ని పరిశోధించారు. ఈ శతాబ్దంలో సముద్రాలలో 7 మైళ్ళ లోతు వరకు వెళ్ళి పరిశోధన కొనసాగించారు. పసిఫిక్ మహాసముద్రంలో ఉన్న ద్వీపాలు ఎక్కువగా అగ్నిపర్వతాల వల్ల ఏర్పడినవేనని గుర్తించడం జరిగింది. సముద్రాల అడుగున క్రస్టులో 5 నుంచి 7 మైళ్ళ దళసరి ఉంటుందని పేర్కొన్నారు.

## మాంటిల్

క్రస్ట్ క్రింది భాగాన్ని మాంటిల్ అంటారు. ఇది దాదాపు 1800 మైళ్ళ దళసరిగా ఉంటుంది. క్రస్ట్‌లో ఉన్న శిలల కంటే మాంటిల్‌లో బరువైన శిలలు ఉంటాయి. అతి పీడనము అతి వేడివలన మాంటిల్ పూర్తి ఘనపదార్థము కాదు. పూర్తి ద్రవపదార్థము కాదు. అది ప్లాస్టిక్ స్వభావము కలిగి ఉంటుంది. క్రస్ట్‌లోని, శిలల పొరలు మాంటిల్ పై తేలుతూ ఉంటాయి.

## భూగర్భ కేంద్రం

కోర్ అంటే భూగర్భ కేంద్రము. దీని ఉపరితల భాగము దాదాపు 1400 మైళ్ళ దళసరిగా ఉంటుంది. దానిలో ఇనుము, నికెల్ కరిగిన ముద్దవలె అతివేడిగా

ఉంటుంది. మాంటిల్‌లో ఉన్న పదార్థం కంటే కోర్ ఉప కేంద్రంలోని పదార్థ సాంద్రత రెండింతలు ఎక్కువ ఉంటుంది.

ఇన్నర్ కోర్ భూగర్భ కేంద్రంలోని భాగం. ఇది దాదాపు 800 మైళ్ల దళసరిగా ఉంటుంది. ఇనుము, నికెల్ లోహములు కలిసి ఘనరూపంలో నిప్పుముద్దవలె ఉంటుంది. ఇది అయస్కాంత శక్తి గలిగి ఉంటుంది.

భూగర్భంలోకి వెళ్తున్న కొద్దీ ప్రతి మైలుకి 10 డిగ్రీల సెంటీగ్రేడు వేడి పెరుగుతూ ఉంటుంది. క్రస్ట్ అడుగు భాగంలో ఉష్ణోగ్రత 500 డిగ్రీల సెంటీగ్రేడ్ ఉంటుంది. మాంటిల్‌లో క్రింది పొరల్లో 2500 డిగ్రీల సెంటీగ్రేడ్. భూగర్భ కేంద్రంలో ఇన్నర్‌కోర్‌లో 4000 డిగ్రీల సెంటీగ్రేడ్ ఉష్ణోగ్రత ఉంటుందని అంచనా. అంటే భూగర్భ కేంద్రంలోని వేడిని సూర్యుని వేడితో కొలచవచ్చు.

## భూమి కంపించడానికి కారణం

క్రస్ట్‌లో ఉన్న శిలల ప్లేట్లు పొరలు పొరలుగా ఉండి ప్లాస్టిక్ రూపంలో ఉండే మాంటిల్ మీద తేలుతూ ఉంటాయి. మాంటిల్‌లోని పదార్థం చల్లారుతూ పైకి వస్తున్న కొద్దీ కొత్త శిలలు, వాయువులు ఏర్పడుతూ ఉంటాయి. వాటికి స్థలం చాలక ఒక శిల ప్లేటు మరో శిల ప్లేటుతో ఢీకొంటూ క్రిందికీ పైకీ కదులుతూ ఉండడం చేత అధికశక్తి ఉత్పన్నమవుతుంది. ఆ ఉత్పన్నమయిన శక్తి అక్కడ స్థలంచాలక క్రస్టు గుండా బీటలు చేసుకొని భూమి పైకి వస్తుంది. ఆ శక్తి వల్ల ఉత్పన్నమయ్యే కంపనాలే భూకంపాలు.

శిలలో ఒక పొర మరొక పొరను నెట్టుకొన్నప్పుడు వాటి అంచుల రాపిడి వల్ల ఉరుములు వలె శబ్దాలు వస్తాయి. అక్కడి వాయువులు వ్యాకోచించడంవల్ల ఏదో భేదించుకుని బయటకు రావడానికి ప్రయత్నించినపుడు క్రస్టుద్వారా భూమి ఉపరితలముపై బీటలువారి పైకి వస్తుంది. ఈ రకంగా బీటలు వారినపుడు భూమి క్రస్టులో ఉండే నీరు, నీటి ఆవిరి, అగ్నిరూపంలో ఉండే ఖనిజాలు, లోహాలు, పొగ,దుమ్ము, వంటివి కూడా ఒక్కొక్కసారి బయటికి వస్తాయి. దీనితో భూమి స్వరూప స్వభావాలే మారిపోతూ ఉంటాయి.

## ఖండాంతర వికర్షణ

క్రస్టులోని శిలల కదలిక వల్ల భూమి పైన నేల భాగాలలో మార్పు రావచ్చు. భూఖండాలు ఉన్న స్థలం నుండి దూరమౌతూ ఉండవచ్చు. ఇప్పుడు ఉన్న విధంగా కొన్ని కోట్ల సంవత్సరాల క్రితం భూ ఖండాలు విడివిడిగా లేవు, 1620లో ఫ్రాన్సిస్ బేకన్ అనే తత్వవేత్త ఖండాంతర వికర్షణ, అంటే Continental drift గురించి విశ్లేషించాడు. 25 కోట్ల సంవత్సరాల క్రితం ప్రపంచంలో ఈనాడు ఉన్న ఖండాలు ఇలా దూర దూరంగా కాక కలిసి వుండేవి.

1912 లో ఆల్‌ఫ్రెడ్ విజనర్ అనే జర్మన్ శాస్త్రవేత్త ఖండాంతర వికర్షణ సిద్ధాంతాన్ని సమర్థిస్తూ మరికొన్ని సాక్ష్యాధారాలు చూపించాడు. ఖండాంతర వికర్షణ 10 కోట్ల సంవత్సరాల క్రితం ప్రస్తుతరూపంలో ఏర్పడిందని అంచనా వేశారు.

## శిలల పొరలలో ప్రకంపనాలు

భూమి అంతర్భాగంలో ఈ శిలల పొరలు ఎప్పుడూ కదులుతూనే ఉంటాయి. దీనివల్ల ఉత్పన్నమయ్యే ప్రకంపనాలు కొన్ని గుర్తించేవిగాను, మరికొన్ని అత్యంత స్వల్పంగాను ఉంటాయి.

ఈ ప్రకంపనాలు రెండు రకాలు. అధిక పీడన ప్రకంపనాలు. కంప్రెషివ్ వేవ్స్ వీటినే P వేవ్స అంటారు. ఇవి నీటిపైన నేలపైన ప్రయాణిస్తాయి. వీటివల్ల శిలల పొరలు వేగంగా ముందుకూ, వెనుకకూ, ప్రక్కలకూ కదులుతాయి. P వేవ్స్ వలన పదార్థంలోని ప్రతి అణువు కంపిస్తుంది. ముందుకీ, వెనుకకు ప్రక్కకు ప్రసరిస్తాయి. ఇవి ఘన, ద్రవ, వాయు పదార్థాల గుండా ప్రయాణిస్తాయి.

'S' ప్రకంపనాలు కేవలం ఘనపదార్థం ద్వారా ప్రకంపిస్తాయి. పైకీ, క్రిందకీ ప్రయాణిస్తాయి. 'L' ప్రకంపనాలు భూమి ఉపరితలం పై ప్రయాణిస్తాయి.

'P' మరియు 'S' ప్రకంపనాలను "సిస్మోగ్రాఫ్" అను పరికరం ద్వారా తెలుసుకుంటారు. 'P' ప్రకంపనాలు సెకండుకి ఆరు, ఏడు కిలో మీటర్ల దూరం ప్రయాణం చేస్తాయి.

## రెండు రకాల భూకంపాలు

భూకంపాలు రెండు రకాలుగా సంభవిస్తాయి. ఒకటి కంప్రెషన్స్‌ఫోర్స్ అంటే రాళ్ళ ఒత్తిడి వల్ల కలిగేవి. అంటే భూమి తన సాగే గుణాన్ని (ఇలాస్టిసిటీ) కోల్పోయి పగుళ్ళు ఏర్పడి భూకంపం సంభవిస్తుంది. సాధారణంగా భూకంపాలు ఈ రకంగా వస్తాయి.

ఇక రెండోరకం భూకంపాలు అగ్ని పర్వతాలు ప్రజ్వరిల్లడం వల్ల సంభవిస్తాయి. అగ్ని పర్వతాలు ప్రేలే ముందు కూడా భూమి కంపిస్తుంది.

భూకంపాల గురించి జరిపిన పరిశోధనల్లో ఎన్నో ఆసక్తికరమైన విషయాలు వెలుగులోకి వస్తున్నాయి. భూమి క్రస్టులో 12 రకాలు విడివిడిగా ఉండే శిలల పొరలు మాంటిల్ మీద తేలుతూ, కదులుతూ ఉంటాయి. రెండు ప్లేట్లు ఒకదాని కొకటి రాసుకుని ఢీ కొంటూ ఉంటాయి.

## భూకంపాల్ని కొలిచే సీస్మోగ్రాఫ్

భూకంపాల తీవ్రతను సిస్మోగ్రాఫ్ ద్వారా తెలుసుకుంటారు. ఇటాలియన్ సీస్మాలజిస్టు మెర్కాలీ భూకంపాలను కొలవడానికి 12 డిగ్రీలతో ఒక స్కేలును తయారుచేశాడు. 1935లో అమెరికన్ సీస్మాలజిస్టు సి. ఎఫ్. రిచర్ మరొక స్కేలును రూపొందించాడు. ఈ రిచర్ స్కేలునే భూకంపాలను కొలవడానికి వాడు

## భూకంపం తీవ్రత- దాని ప్రభావం

ఈ రిచర్ స్కేలులో 3.5 నుండి 4.2 మాగ్నిట్యూడ్‌లో వున్న భూకంపం తీవ్రత వల్ల భూమి సెకండుకు 10 నుండి 50 సార్లు కంపిస్తుంది. ఈ భూకంపాన్ని యంత్రాలే గుర్తించగలవు.

ఈ స్కేలులో 4.3 నుండి 4.8 వరకు గుర్తించే భూకంపాల ప్రభావం ఒక మాదిరిగా ఉంటుంది. ప్రజలు భూకంపం వచ్చిందని గుర్తిస్తారు. కిటికీలు, గుమ్మాలు దడదడలాడతాయి. నిద్రపోయినవారు లేచి కూర్చుంటారు. పెద్ద గంటలు భూకంప ప్రకంపనాలకు కొట్టుకుని మ్రోగడం ప్రారంభిస్తాయి. భూమి సెకండుకు 100 నుండి 200 సార్లు కంపిస్తుంది.

రిచర్ స్కేలులో 4.0 నుండి 5.4 వరకు వచ్చే భూకంపం తీవ్రంగా ఉంటుంది. చెట్లు ఊగడం ప్రారంభిస్తాయి. వ్రేలాడదీసిన వస్తువులన్నీ ఊగుతాయి. వస్తువులు తల్లక్రిందులవుతాయి. ఈ స్థితిలో భూమి 500 సార్లు కంపిస్తుంది.

ఇక 5.5 నుండి 6.1 స్కేలులో ఉండే భూకంపం వలన గోడల బీటలు వారతాయి. సిమెంటు ప్లాస్టింగ్ ఊడిపడిపోతుంది. భూమి సెకండుకు 1000 సార్లు కంపిస్తుంది.

6.2 నుండి 6.9 వరకు వచ్చే భూకంపం నాశనానికి దారితీస్తుంది. భూమి 200 సార్లు నుండి 5000 సార్లు కంపిస్తుంది. దాని ప్రకంపనాల వలన బిల్డింగులు కూలిపోతాయి. రోడ్డు మీద కార్లు నడుపుతున్నవారు భూకంప ప్రమాదం వలన అదిరిపోతారు. ఫ్యాక్టరీల చిమ్నీలు పడిపోతాయి. భూమి మీద పగుళ్ళు కనబడతాయి. భూమిలోని నీటి గొట్టాలు పగిలిపోతాయి.

తాయి. రైల్వే లైనులు వంకర టింకర తిరిగిపోతాయి. భూమి విచ్చిపోయి బిల్డింగు లకు తీవ్రంగా నష్టం కలుగుతుంది.

అతి దారుణంగా వచ్చే భూకంపం 7.4 నుండి 8.1 మధ్యలో ఉంటుంది. పట్టణాలు సర్వ నాశనమయి ఏవో కొద్ది బిల్డింగులు తప్ప తక్కినవన్నీ నేలమట్ట మవుతాయి. బ్రిడ్జీలు కూలిపోతాయి. నీటి గొట్టాలు, కేబుల్స్ నాశనమయిపోతాయి. కొండలాళ్ళు విరిగిపడటమే కాకుండా వరదలు కూడా ఈ భూకంప ప్రభావం వలన వస్తాయి. భూమి సెకండుకు 9,800 సార్లు కంపిస్తుంది.

ఇక సర్వ వినాశనానికి దారితీసే భూకంపం రిచర్ స్కేలులో 8.1కి పైన వుంటుంది. ఇంత వరకు రికార్డు అయిన భూకంపాలలో అతి వినాశనమయిన భూకంపంలో రిచర్ స్కేలులో 8.9 గా గుర్తించ బడింది. భూమి ఎంత తీవ్రంగా కంపిస్తుందంటే భూమిమీద వస్తువులు ఆ దెబ్బకి గాలిలోకి ఎగరడం ప్రారంభిస్తాయి. భూమి కొన్ని చోట్ల ఎత్తు పెరిగి పోవడం, మరికొన్ని చోట్ల లోయలు ఏర్పడటం జరుగుతుంది.

భూకంపం ఒక పెద్ద ప్రాకృతిక విపత్తు. మానవుడు దాన్ని జయించాలంటే తన జీవిత విధానంలో ఇళ్ళు కట్టుకొనే పద్ధతిలో మార్పు చేసుకోవాలి. జపాన్‌లో భూకంపాలను తట్టుకోవడానికి అట్ట చెక్క ఇళ్ళు నిర్మించుకుని తమను తాము సంరక్షించుకుంటున్నారు. అదే విధంగా మన దేశంలో కూడా భూకంపాలు తరచుగా రావడానికి అవకాశమున్న ప్రాంతాలలో ప్రాణ నష్టం తగ్గించడానికి తగిన జాగ్రత్తలు తీసుకోవాలి.

అలాకాక భూకంపం అంటే దేవుని కోపమనో, ప్రపంచంలో పాపం పెరగటం వల్ల భూకంపం వచ్చిందనో, లేదా కర్మ, నుదుటివ్రాత, పూర్వజన్మ సుకృతం వల్ల వచ్చిందనో అశాస్త్రీయంగా ఆలోచిస్తు కూర్చుంటే ప్రాకృతిక విపత్తులు వచ్చినప్పుడు ఆస్తినష్టమే కాక, ప్రాణ నష్టం కూడా ఎక్కువగా జరుగుతూ ఉంటుంది.

నిరంతరం గతి శీలం, ప్రగతిశీలంగా మానవుడు ఎదుగుతూ ఉంటే ఎన్నో ప్రాకృతిక విపత్తులను అధిగమించి మనగలుగుతున్న మానవుడు తన బుద్ధి కుశల తతో భూకంపాలను కూడా అధిగమించి మరింత ముందుకు సాగగలడు. అంచేతనే ఈనాడు కావలసింది సైన్సు, శాస్త్రీయ దృష్టి, సంఘదృష్టి పెంచుకోవాలి.

(నాస్తిక మార్గం- 93 నవంబరు సంచిక సౌజన్యంతో)

# స్వీకారం

1. ఈ తరానికి చెరబండరాజు చిరునామా, విరసం జంటనగరాల శాఖ ప్రచురణ పేజీలు- 174 వెల : 20-00.

2. శ్వేతరాత్రులు (కథా సంకలనం), సంపాదకులు : కాళీపట్నం రామారావు. ఆర్.కె. పబ్లికేషన్స్ విశాఖపట్నం ప్రచురణ, పేజీలు 206, వెల : 35-00.

   పై రెండు పుస్తకాలకు : నవోదయ బుక్‌హౌస్, కాచిగూడా చౌరస్తా హైదరాబాదు.

3. పాతాళ గరిగె (కవితా సంకలనం), జూకంటి జగన్నాథం కవితలు- పేజీలు 74. వెల : రు. 20-00 ప్రచురణ : ప్రతులకు, నయనం ప్రచురణలు, సిరిసిల్ల. 505301.

4. కంజిర. 6 డిసెంబరు 1992 (పొయెట్రీ బులెటిన్-8) 48 పేజీలు. వెల 5-00. ప్రతులకు : 46-16-23 దానవాయిపేట, రాజమండ్రి 593103.

5. అక్షరదీప్తి (కవితోక్తులు) రచన : పొట్లపల్లి రామారావు. పేజీలు 98. వెల : 12-00 ప్రతులకు : అజ్ఞాత ప్రచురణలు, పోస్టు తాటికాయల. ధర్మసాగరం మండలం. వయా పెదపెండ్యాల వరంగల్లు జిల్లా.

6. సంతకాలు. కవితా సంచిక 3- జులై 93. కవితలు- కవితలపై వ్యాసాలు. 64 పేజీలు. వెల : 5-00.

7. పద పారిపోదాం. వేగుంట మోహనప్రసాద్- కె. శివకుమార్‌ల సంయుక్త కవిత. 14 పేజీలు. వెల : 5-00. పై రెండు పుస్తకాలకు : పొయెట్రీఫోరం టి.బి.రోడ్, తెనాలి-522201.

8. డంకెల్ దుశ్శాసనం. రచన : అబ్దుల్ నూర్‌భాషా, దినదినగండం. రచన- ఎమ్. కోదండరామిరెడ్డి.
   ఒక్కొక్కటి పదిరూపాయలు. ప్రతులకు : నవోదయ బుక్‌హౌస్ 3-3-865 కాచిగూడ హైదరాబాదు-27.

---

Eedidt, Printed and Published by K. RAVI BABU on behalf of JANA SAHITI (A.P.). at Chaitanya Printers, Vijayawada-2. for Co-operative Press, Vijayawada.
Working Editer ; NIRMALANANDA

నీతులు శాసించే బ్రాహ్మణ్యం గొంతు పిసికినపుడూ
వంటిని వడి తిప్పిన శోకం
ముఖంలోంచి జడివానై కురవలేదు
కాలమా/వెనక్కి నడువు
ఆమె శాసనాల్ని ధిక్కరిస్తున్నది
భీకర శబ్దంతో ఎడారిని చుట్టివచ్చే సుడిగాలిలో
రక్త సంబంధాలన్నీ కొట్టుకు పోయినపుడు
చల్లని స్నేహం కోసం
కన్నీటి సర్పాల్ని గొంతు పుట్టలో అదిమి పట్టింది
సుదీర్ఘ ఏకాంత యానంలో/చిట్ట చివరి సహచరి కోసం
కళ్ళని కాటుకతో గాయపరిచినా రాని కన్నీళ్ళని
అమ్ముదామను కున్నది
కాలమా/ఎగపోత ఆపేయి
నలుపు తెలుపు జీవన స్థలాల్లో
మృత్యువు సామూహిక నృత్యం అంతిమ సంగీతం ధ్వనిస్తోంది ...
తమ విషాద స్మృతుల్నీ బీటలపడ్డ బాధల మచ్చల్నీ
'తడి' చేతుల్తో పునికిన ప్రియురాలు
శరీరమ్మీద నల్లని చావు బట్ట కప్పేసి
శాశ్వతంగా నిష్క్రమించింది/ఇంకెవరికో 'రఖేలీ' అనుకున్నది
తమ తల్లేనన్న జీవరహస్యాన్ని మృత్యువార్తతో పంపింది-
జీవితకాలం వుగ్గబట్టుకున్న దుఃఖం
ఒక్కసారిగా పెల్లుబికి
దిగంతాలు సముద్ర కెరటాలకు తలలు బాదుకున్న హోరు
కాలమా/ బుసకొట్టడం ఆపేయ్
ఆమె మొదటిసారిగా కన్నీరై బద్దలైంది ..
తన బతుకును శకలాలుగా ఛిన్నాభిన్నం చేసిన
ఠాకూర్ శవం ముందు
కసిని కళ్ళకు పుమ్మిగా రాసుకుని శోకం నటించినా
తనను పోల్చుకున్న మనకేసి చేతులు చాస్తో
వురుముతున్న శోకమేఘమై
ఆకాశం నెలియకట్ట దాటి పొర్లుతోంది-
కాలమా/ఆమె ద్వేషాన్ని కొక రూపాన్నివ్వు!

—నారాయణస్వామి